# పీయూష లహరి

శ్రీ జయదేవకవి విరచిత
సంస్కృత గోష్ఠీ రూపకానికి

శ్రీ పావిలాల సోమయాజుల
తెలుగు అనువాదం
మూలసహితంగా ముద్రితం



ప్రచురణ
తెలుగు విశ్వవిద్యాలయం
కళాభవన్, సైఫాబాద్
హైదరాబాద్ : 500 004



తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ-104

శ్రీ జయదేవ కవి విరచిత

# పీయూష లహరి

[గోష్ఠి రూపకము]

అనువాదకుడు :

శ్రీవావిలాల సోమయాజులు

సంపాదకుడు :

డా. వి.వి.యల్. నరసింహారావు

ప్రచురణ :

తెలుగు విశ్వ విద్యాలయం

కళాభవన్, హైదరాబాదు-4

Telugu University publication series No. 104

# PIYUSHA LAHARI

Goshti Rupaka in Sanskrit - By sri Jayadeva kavi
Translated in to Telugu
By Sri Vavilala Somayajulu

Edited By : Dr. V.V.L. Narasimha Rao

First Edition
March 1990

Copies 1000



PRICE Rs. 9-50 Ps.

Published By
The Telugu University, HYDERABAD - 4

For Copies :

The Registrar,
Telugu University,
Kalabhavan, Saifabad
Hyderabad : 500 004

Printed at :

S.V. Printers, Gandhinagar,
HYDERABAD - 500380

3-3-91

# భూమిక

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు,
తెలుగు విశ్వవిద్యాలయం,

తెలుగు భాషా సాహిత్య కళాసంస్కృతుల సర్వతోముఖ వికసనానికీ, వికసనానికీ ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ చేసిన చట్టం ప్రకారం 1985 డిసెంబరు 2వ తేదీన రూపుదాల్చిన విశిష్ట విద్యాసంస్థ తెలుగు విశ్వవిద్యాలయం. శోధన, పరిశోధన, ప్రచురణలతోపాటు విస్తరణసేవ, రాష్ట్రేతరాంధ్రులకూ, విదేశాంధ్రులకూ సహాయ సహకారాల కల్పన వంటి బహుముఖీన్న కార్యక్రమాలను కూడా విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది. పూర్వంవున సాహిత్య, సంగీత, నృత్య, నాటక, లలితకళా అకాడమీలు, తెలుగు భాషా సమితి, అంతర్జాతీయ తెలుగు కేంద్రం విలీనం కావడంతో విశ్వవిద్యాలయం వివిధ పీఠాల, విభాగాల సమాహారంగా వ్యవహరిస్తోంది.

తెలుగుజాతి వైభవోన్నతులకు అద్దంపట్టే గ్రంథాల ప్రచురణ విశ్వవిద్యాలయ ప్రధానాశయాలలో ఒకటి. విశ్వవిద్యాలయంలో విలీనమైన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవిశ్రాంత కృషిద్వారా దేశ సాహిత్య రంగంలో విశిష్టస్థానం సంతరించుకుంది. 1957 ఆగస్టు 7వ తేదీన ఆంధ్రప్రదేశ్‌లో ఏర్పాటైన ఈ అకాడమి దేశం మొత్తం మీద ప్రప్రథమ రాష్ట్ర స్థాయి అకాడమి కావడం విశేషం. ఈ అకాడమి ప్రామాణికమైన నిఘంటువులు, పదకోశాలు, కావ్యాలు, ప్రబంధాలు, వ్యాసాలు, విమర్శలు, కల్పనా సాహిత్యం, పరిశోధనాత్మక గ్రంథాలు, జీవితచరిత్రలు, అనువాదాలు మొదలైనవి అనేకం ప్రచురించింది.

సంగీత, నృత్య, నాటక, లలితకళా అకాడమీలు తమ ఆశయాలకూ, లక్ష్యాలకూ అనుగుణమైన గ్రంథాలను ప్రకటించాయి. అంతర్జాతీయ తెలుగు సంస్థ ఇతర ప్రాంతాలలో నివసిస్తున్న తెలుగువారికి పెక్కు గ్రంథా

లను అందించింది. తెలుగు భాషాసమితి విజ్ఞానసర్వస్వ సంపుటాలను ప్రచురించింది.

తెలుగు విశ్వవిద్యాలయం ఈ ప్రచురణ సత్సంప్రదాయాన్ని కొనసాగిస్తూ, ఇంతవరకు 103 గ్రంథాలు వెలువరించింది.

ప్రస్తుత ప్రచురణ 'పీయూషలహరి' అపురూపమైన కృతి. అత్యంత ప్రజాదరణ పొందిన గీతగోవింద కావ్యకర్త జయదేవకవి రచించిన 'గోష్ఠి రూపకం' ఇది. గీతగోవిందానికి పీయూషలహరి పూర్వరంగం వంటిదనవచ్చు. రెండింటిలోనూ శ్రీకృష్ణుని రాసలీలలు ఇతివృత్తాలు. ఈ గోష్ఠిరూపకాన్ని ప్రసిద్ధ సాహితీవేత్తలు శ్రీ వావిలాల సోమయాజులుగారు సేకరించి అనువదించి ప్రచురణకోసం తెలుగు విశ్వవిద్యాలయానికి అందించారు. వారికృషిని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను, వారికి కృతజ్ఞతలు అందచేస్తున్నాను.

'పీయూషలహరి' పై పండిత కె.కార్ సంస్కృతంలో వ్యాఖ్యానం రాశారు. ఈ వ్యాఖ్యానం, ఇంగ్లీషులో పీఠికతోపాటు నాగరలిపిలో సంస్కృత మూలపాఠాన్ని ప్రత్యేక ప్రచురణగా విశ్వవిద్యాలయం పాఠకలోకానికి అందిస్తోంది.

ఉత్తమ గ్రంథాలను అందించాలనే తెలుగు విశ్వవిద్యాలయం సంకల్పానికి ఈ గ్రంథం ఒక నిదర్శనం. ఇది తెలుగు పాఠకుల అభిమానాన్ని చూరగొంటుందని విశ్వసిస్తున్నాను.

ఆచార్య సి. నారాయణరెడ్డి
ఉపాధ్యక్షులు
తెలుగు విశ్వవిద్యాలయం

హైదరాబాదు-4
తేది : 22-2-1990

# విషయ సూచిక

పీయూషలహరి – పీఠిక

## శ్రీ జయదేవ కవి విరచిత

# పీయూష లహరి

### పీఠిక

### శ్రీ వావిలాల సోమయాజులు

## గీ త గో విం ద ం

ఆంధ్రులకు అష్టపదులంటే అపరిమితమైన అభిమానం. బహు కాలంనుంచీ సంగీత విద్వాంసులు గాన విద్యాప్రావీణ్యానికి గీతగోవింద గాన సామర్థ్యాన్ని ఒక ఒరపిడి రాయిగా నిర్ణయించి ఉండటం గమనించదగ్గ విషయం.

అష్టపదులకు ఏ తత్కృతికర్త ఉంచిన నామం గీతగోవిందం. గోవిందుని గురించిన గీతాలుగల ప్రబంధం కాబట్టి దాని కీ పేరు ఉచితమని భావించి ఉండవచ్చును. అష్టపదులంటే అంత ఆదరాభిమానాలను ప్రకటిస్తున్నా ఆంధ్రులు తద్రచయిత జయదేవునిగురించి విశేషంగా తెలుసుకున్నట్లు కనిపించదు.

## జ య దే వు డు

మహాకవి జయదేవుడు అద్వితీయ మహాభక్తుడుగా పరిగణితుడైనాడు. భక్త చరిత్రలవల్ల ఆయన జీవిత విశేషాలు కొన్ని తెలుస్తున్నవి. క్రీ.శ.15 వ శతాబ్దంలో చంద్రదత్తుడు కూర్చిన 'భక్తమాల'లో జయదేవుని జీవితం కొన్ని సర్గలలో [36-47] వర్ణితమైంది. ఆయనను గురించిన కొన్ని జనశ్రుతులు కూడా దేశంలో ప్రచారంలో ఉన్నవి.

జయదేవుని బాల్యదశను గురించిన విశేషాలేమీ తెలియటంలేదు. విద్యార్థిదశలో గురువులయొద్ద పక్షం మార్చి మరొక పక్షం విద్యాభ్యాసం[1] చేయటం వల్ల జయదేవుడికి పక్షధరమిశ్రుడనే పేరువచ్చిందని కొందరంటారు. కాని యీ బిరుదం గీతగోవింద కారునిది కాదనీ, ప్రసన్న రాఘవకర్త అయిన మరొక జయదేవుడిదనీ తెలుస్తున్నది. గీతగోవిందంలో జయదేవుడు "పద్మావతీ చరణచారణ చక్రవర్తి" నని చెప్పుకున్నాడు. పద్మావతీదేవి ఆయనభార్య అనీ, దేవదాసి అనీ భిన్నాభిప్రాయా లున్నవి. ఇందులో ప్రథమాభిప్రాయాన్నే పండితలోకం అంగీకరించింది. బహుకాలం సంతానం లేక ఒక బ్రాహ్మణుడు జగన్నాథస్వామి నారాధించి ఒక పుత్రికారత్నాన్ని పొంది ఆమెకు పద్మావతి అని నామకరణం చేసి మహావిష్ణువుకు తప్ప నన్యులకామె నీయనని నిశ్చయం చేసుకున్నాడట. ఆమెకు యుక్తవయసు వచ్చిన తరువాత పుత్రికను వెంటతీసుకుని ఆమెను దేవదాసిగా స్వామిపేర విడిచిపెట్టటానికి పురుషోత్తమ క్షేత్రానికి వెడుతుండగా జగన్నాథస్వామి సాక్షాత్కరించి 'ఓ భక్తశ్రేష్ఠుడా! నా కర్పింపదలచిన యీకన్యకను నా అంతరంగ భక్తుడైన జయదేవుడి కర్పించు. అదే నా కమితానంద'మని పలికినాడట! అప్పుడు పరివ్రాజక శ్రేష్ఠుడుగా ఉన్న జయదేవు డామెను స్వీకరింప నిరాకరింపగా తండ్రి 'ఇది భగవదాజ్ఞ' యని పుత్రిక నట నుంచి పోగా జయదేవు డామె శుశ్రూషను స్వీకరించి క్రమముగ స్నేహభావముపెంపొందిన పిమ్మట వివాహమాడి నటుల 'భక్తమాల'వల్ల తెలుస్తున్నది.

జయదేవుడు ఉపాస్యదేవత అయిన నారాయణమూర్తి కైంకర్యం కోసం ధనార్జన చేయటానికి బృందావనం, జయపురం మొదలయిన ప్రదేశాలకు వెళ్ళి తిరిగి వస్తుండగా దారిలో చోరులు ఆయన ధనాన్ని అపహరించి కాళ్ళుచేతులు విరుగగొట్టి పోయినారట! ఒక ప్రభువు వేటకు వచ్చి ఆయన దుర్దశను జూచి రాజధానికి తీసుకొనిపోయి చికిత్సచేయించి స్వాస్థ్యం చేకూర్చిన తరువాత పద్మావతితో ఆ కవి అక్కడనే కాపురంచేస్తూ ఉన్నాడు.

---

1 ప్రతిభ - జనవరి 1938-- 'జయదేవుడు'- రాయప్రోలు సుబ్రహ్మణ్యము పే. 209.

యతివేషాలు వేసుకొని వెనుకటి చోరులు ఆ రాజధానికి వచ్చినా తెలుసు కొని కూడా వారికి జయదేవుడు శిక్షచెప్పించలేదట ![2]

జయదేవస్వామిగా వేదవ్యాసులే నిజాంశతో తిందుబిల్వ గ్రామమున జనించినారని యొక ప్రతీతి యున్నది. జయదేవుడు పదునెనిమిది క్రోసుల దూరంలో ఉన్న గంగానదికి నిత్యమూ స్నానానికి వెళ్ళి వచ్చేవాడట. గంగా దేవి ఆయన కష్టాన్ని జూచి ఓర్వలేక ప్రసన్నురాలై "ఒకమాట, నీవు నిత్యమూ నా దగ్గరకు రాలేవు. నేనే నీ దగ్గరకు వస్తాను" అనికెందులి ప్రాంతానికి వెళ్ళిందని మరొక కింవదంతి. తన కపకార మొనర్చిన చోరులు సాధు వేషముల ధరించి తిరుగుచుండగా రాజభటులు వారిని పట్టుకొనినపుడు జయదేవస్వామివారికి రాజుసన్నిధిని సన్మానమును కల్పించి పంపుచుండగా వారిని మార్గమధ్యమున పృథ్వి తనగర్భమున జేర్చుకొన, రాజభటులు వచ్చి విన్నవించినారట! అపుడు జయదేవస్వామి యా ప్రాంతమున కేగి గరుడ వాహనుని ప్రార్థింప నాతడు ప్రత్యక్షమై ద్రోహుల్ని మరల పుడమినుండి రప్పించి పంపినట్లు మరియొక కథనము వినిపించు చున్నది.

పద్మావతీదేవి పాతివ్రత్యమును బరీక్షింప నొకమారు సాత్యకిరాజు స్వామి ఇంటలేని సమయమునందు విచ్చేసి 'మీ భర్త దుర్జనులచే హత మైనా' డని ఒక యళీకవార్త వినిపింప నామె యాత్మహత్య చేసుకొనగా జయదేవస్వామి తిరిగివచ్చి కృష్ణసంకీర్తన మొనర్చగా నామె 'సుప్తిబోధిత' వలె మేల్కొనినట్లు మరియొక జనశ్రుతి వినవచ్చుచున్నది.

ఇట్టివి అభూత కల్పనలని త్రోసివేసినను స్వామి అసామాన్య శక్తి సంపన్నుడని అంగీకరించుట కెట్టి విప్రతిపత్తియును లేదు.

---

2. "శిష్యునిపైగల వాత్సల్యంతో అతని దేశానికి వెళ్ళి వచ్చేటప్పుడు ఆ శ్రేష్ఠి శిఖామణి స్వామికి తెలియకుండా పల్లకీలో దాచిఉంచిన ధనాన్ని బోయీలే అపహ రించి జయదేవుని కాలుచేతులు విరుగగొట్టి యరణ్య మధ్యమున విడిచి పారిపోయినట్లు మరియొక కథ" గీతగోవిందము-- పీఠిక: ఎ.వి. నరసింహ పంతులు పే. 12-
(M. Adhi & Co-- Madras-Publication 1911)

## జయదేవుని జన్మస్థానం

జయదేవ మహాకవి జన్మదేశాన్ని గురించి పండిత లోకంలో భిన్నాభిప్రాయా లున్నవి. పండిత పరంపరలో అతడు ఉత్కల దేశస్థుడని ఒక అభిప్రాయం ఉంది. ఆయన వంగదేశంలో జన్మించాడని కొందరు విద్వాంసులు నిర్ణయించారు. జయదేవ కవి తన జన్మస్థలాన్ని గురించి ఏడవ అష్టపది ముద్రికలో "తిందుబిల్వ సముద్ర సంభవ రోహిణీ రమణేన" అని సూచించినాడు. కలకత్తా సర్వకళాశాలలో ఓఢ్ర పండితులు, శ్రీ వినాయక మిశ్రో మహాశయులు ఒకమారు శ్రీ శివశంకరులకు ఒక లేఖ వ్రాస్తూ[3] జయదేవ కవి జన్మస్థానాన్ని గురించి ఇలా వ్రాసినట్లు తెలుస్తున్నది.

"జయదేవుడు ఉత్కలదేశంలోనే పుట్టినట్లు నిస్సందేహంగా చెప్పటానికి తగినంత ఆధారం లేదన వలసి వస్తుంది. అయితే ప్రతాపరుద్ర మహారాజు పదహారో శతాబ్దిలో రాజ్యంచేశాడు. ఆయన జగన్నాథ దేవాలయంలో దేవదాసీలు గీతగోవిందం తప్ప మరేదీ పాడకూడ దన్నట్లు ఒక శాసనంలో కనపడుతోంది. మహారాష్ట్ర దేశంలో ఒకానొక వైష్ణవశాఖ వారి సంప్రదాయంలో జయదేవుడు ఉత్కలదేశంలో జన్మించాడనే ఉంది. ఇప్పటికీ ప్రతి సంవత్సరమూ జయదేవ గౌరవార్థం వేదువి గ్రామంలో 'మేలా' జరుగుతున్నది. కాబట్టి వంగదేశ విద్వాంసులు ఆ గ్రామమే కేందుబిల్వ మని అంటున్నారు."

ఈ లేఖనుబట్టి జయదేవుని జన్మస్థాన మిదమిత్థమని నిర్ధారితం కాలేదు. కానీ ఉత్కలదేశ గ్రంథకర్తలు జయదేవుడు 'తమవా'డని ఉద్ఘోషించినారు. గీతగోవింద ప్రతుల్లోనే కేందుబిల్వానికి తిందుబిల్వమూ, బిందుబిల్వమూ అనే రూపాంతరాలు కనిపిస్తున్నవి.

కొందరు జయదేవుని కేందుబిల్వమును వంగదేశంలోని వీరభూమి జిల్లాలోని కేందులి గ్రామమని భ్రాంతి పడినారు. అది అజయనదికి ఉత్తర

3. ప్రతిభలో 'జయదేవుడు' (సం 2 సంచిక 3) అన్న వ్యాసంలో ప్రకటితము.

తీరాన ఉన్నవి. అజయ భాగల్పూరు జిల్లా దక్షిణాంశములో పుట్టి సంటాల్ పరగణా దక్షిణాంశములో ప్రవహించి తరువాత వీరభూమి, వర్ధమాన జిల్లాల మధ్యగా, తూర్పుగా వెళ్ళి కాటోజార్ దగ్గిర భాగీరథిలో పడుతుంది. వీరభూమి జిల్లాకు ప్రధాన పట్టణమైన సురికి ఇది రమారమి తొమ్మిది క్రోసులదూరంలో ఉంటుంది. ఈ గ్రామంలో రాధాదామోదర విగ్రహాలు ఉన్నవి. అందువల్ల ఇది జయదేవుని జన్మ గ్రామమై ఉంటుందన్న అభిప్రాయంతో తరువాత చారిత్రికపరిశోధన జరిపినవారు ఏకీభవించటంలేదు.

వీరి అభిప్రాయంలో కెందులి ప్రాంతము పూరీ జిల్లాలోని రెహంగ్ వద్ద ఉన్న- కెందులి సాసనము, కెందులి పట్నము, కెందులి దౌళి- మూడు గ్రామములలో కలసిన దేశము. ఇవి ప్రాచీనది ఒడ్డున ఉన్నవి. ఈ నది ఒరిస్సా దేశీయుల దృష్టిలో పరమ పవిత్రమైంది. ఈ నదిని ప్రాచీన మాహాత్మ్యమూ, పద్మపురాణమూ సరస్వతీనది అని వ్యవహరించినవి. 'సాక్షాత్సరస్వతీ ప్రాచీ నాన్యథా నృపసత్తమా, క్రోశే క్రోశేచ లింగాని తటే తస్యా మనోరమే' అనే కపిల సంహితలోని శ్లోకం ఇందుకు ప్రమాణము. కెందులి గ్రామసీమనుండి రెండు మైళ్ళ దూరంలో కుశభద్రానది రెండు పాయలతో ప్రాచీనదిని కలిసే చోటును జనం త్రివేణీసంగమ మని వ్యవహరిస్తారు. కెందులి గ్రామంలో వాసుదేవ విగ్రహాలు నారాయణ నామంతో అనేకం కనిపిస్తున్నవి. ప్రాచీనది ఒడ్డున నిలిచి ఒకమారు సింహావలోకనం చేసే వారికి చైతన్యస్వామి కాలంలో పంచమహాపురుషుల్లో ఒకడని ప్రసిద్ధి పొందిన అచ్యుతానందుడు శూన్యసంహితలో కెందులిని వర్ణించిన అతిశయ మంతా గోచరిస్తుంది. అందువల్ల జయదేవుని జన్మగ్రామం ఒరిస్సాలోని ప్రాచీనది ఒడ్డున ఉన్న కెందులి అని అనటం సమంజసం అని చరిత్రజ్ఞులు నిర్ణయించినారు[4].

---

4 Journal of the Kalinga Historical Research Society, March 1947

Introduction To Kavi Jayadeva In Gita Govinda-H.K. Mukharji

కెందులి వీరభూమి జిల్లాలోని అజయ నది ఒడ్డున ఉన్నదని కొందరు భ్రమపడి వ్రాయటానికి కారణాలు క్రింది ఈ రెండు శ్లోకాలు.

"గోవర్ధనశ్చ శరణో జయదేవ ఉమాపతిః
కవిరాజశ్చ రత్నాని సమితౌ లక్ష్మణశ్చచ"

(వీరభూమి వివరణము పే 196)

"వాచః పల్లవయ త్యుమాపతిధరః సందర్భ శుద్ధిం గిరామ్
జానీతే జయదేవ ఏవ, శరణశ్లాఘ్యో దురూహ ద్రుతేః
శృఙ్గారోత్తర సత్ప్రమేయ రచనై రాచార్య గోవర్ధనః
స్పర్ధీ కోపి న విశ్రుతిధరో ధోయీకవి క్ష్మాపతిః"

(గీతగోవిందం సర్గ 1. శ్లో. 4)

ఇందలి మొదటి శ్లోకమును నవద్వీపములోని సభామంటప భిత్తిక మీద ఉండగా శ్రీ వాదిసనాతన గోస్వామి చూచినట్లు వంగదేశంలో ఒక ప్రథ ఉన్నది కానీ సనాతన గోస్వామి ఈ విషయాన్ని గురించి ఆయన గ్రంథాలలో ఎక్కడా పేర్కొనలేదు. అందువల్ల ఈ శ్లోకాన్ని ఎవరో జయదేవుని వంగవాసిని చేయటానికి కల్పించి ఉంటారు. "వాచః పల్లవయత్యుమాపతిధర" ఇత్యాది శ్లోకాన్ని జయదేవ మహాకవి వ్రాసి ఉంటాడని అనటానికి వీలులేదు. అది ఎవరివల్లనో గీతగోవిందంలో ప్రవేశించి ఉంటుంది. గీతగోవిందప్రబంధానికి ప్రప్రథమంలో వ్యాఖ్యానం వ్రాసిన కుంభరాణా పలికిన "ఇదానీంకవిః కవి గణనాయాం పరైరపి కవిభి రహం పరిగణిత ఇతి స్వప్రశంసార్థం క్షేపకమపి తత్కృతం శ్లోకం స్వగ్రంథస్య కుర్వన్నాహ" అన్న వాక్యం నేటి చరిత్రజ్ఞుల పైఊహకు ఉపోద్బలకంగా కనిపిస్తున్నది. కుంభరాణా అభిప్రాయంకూడా దీన్ని ఎవరో గీతగోవిందంలో ప్రవేశపెట్టి ఉంటారనే.

కాబట్టి వంగదేశం జయదేవుని జన్మస్థానమని చెప్పటానికి ఎవ్విధమైన ఆధారమూ కనిపించడం లేదు. అతడు ఉత్కల దేశస్థుడనటమే సమంజసము. దీనికి అనుగుణంగా ప్రాచీనులు వ్రాసిన గ్రంథాలలో ప్రబలాధారాలు కనిపిస్తున్నవి. సంస్కృత భాషలో భక్తమాల గ్రంథాన్ని చెప్పిన

చక్రదత్తుడు జయదేవుణ్ణి గురించి వ్రాస్తూ ఆయన వ్యాసభగవానుని అవతారమనీ, జగన్నాథనిలయమైన పూరీకి దగ్గిరగా ఉన్న తిందు బిల్వ మతని జన్మగ్రామమనీ చెప్పినాడు. ఇదే అభిప్రాయాన్ని గ్వాలియర్ నవజీ, మహారాష్ట్రి దేశీయుడైన మహాభక్తి విజయకర్త మహీపతీ పలికినారు. అస్సాంలోనూ, మహారాష్ట్రింలోనూ జయదేవుడు ఉత్కల దేశీయుడేననిన్నీ ప్రతీతి. గదుని సంప్రదాయ కులదీపికలో జయదేవుడు ఉత్కల దేశీయుడని వ్యవహృతము కావటమూ జయదేవుని జన్మదేశం ఉత్కలమనే నిరూపిస్తూ ఉన్నవి.

జయదేవుడు రాఢ దేశస్థుడని శ్రీసునీత కుమార ఛటర్జీ మతము.

## జయదేవుని కాలం

జయదేవ మహాకవి కాలనిర్ణయమును గురించికూడా భిన్నాభిప్రాయాలున్నవి. మేవాడ ప్రభువు కుంభరాణా గీతగోవిందానికి ప్రథమంలో వ్యాఖ్యానం వ్రాసినాడు. ఆయన క్రీ.శ. 1419 వ సంవత్సరంలో సింహాసనాన్ని అధిష్ఠించాడు.అందువల్ల జయదేవ కవికూడా అప్రాంతం వాడై ఉండవచ్చునని ఒక అభిప్రాయం ఉన్నది. జయదేవుడు రామానందుని శిష్యుడని ఉన్న ఒక ప్రవాదాన్ని ఆధారం చేసుకుని కొందరు ఆయన క్రీ.శ. 14 వ శతాబ్దంలో జీవించి ఉన్నాడు గనుక ఇతడుకూడా క్రీ.శ.14వ శతాబ్దివాడనినారు. 'హృది బిసలతాహారో' అన్న జయదేవ శ్లోకాన్ని విద్యాపతి సంపూర్ణంగా ఒక గీతికలో అనుకరించటంవల్ల అందుకు కొంచెం పూర్వుడై ఉంటాడని కొందరి అభిప్రాయం. వంగ వాఙ్మయ చరిత్రకారుడు విద్యాపతి క్రీ॥శ॥ 1360 ప్రాంతమువాడని నిశ్చయించినారు. పృథ్విరాజు ఆస్థానకవి చాంద్ బర్దాయీ తన పృథ్విరాజరాసోగ్రంథంలో 'జయదేవ అఠంకవీ కబ్బిరాయం, జినై కేవల్ కిత్తగోవిందగాయం' అని చెప్పినాడు. క్రీ.శ. 1193 వ సంవత్సరాన టిలైన్ యుద్ధంలో పృథ్విరాజు ఘోరీతో పోరాడి మృతినొందినాడు. కాబట్టి చాంద్ భట్టుకు జయదేవుడు పూర్వుడై ఉండాలి. జయదేవ లక్ష్మణసేనులు సమకాలికులన్న నిశ్చయంతో రాజేంద్ర లాల్ మైత్రా, జయదేవుడు క్రీ.శ. 1101-1121 మధ్య కాలములోని వాడనీ, రామకృష్ణ ముఖర్జీ అతడు క్రీ శ. 1205 ప్రాంతంవాడనీ నిర్ణయించినారు.

జయదేవ కవి కాలనిర్ణయమును శ్రీ కరుణాకరకార్ మహాశయులు మరియొక నూతన మార్గము ననుసరించి యొనర్చినారు. వారి మార్గము నూతనము. ప్రమాణములును నూతనములు. జయదేవ కవికిని లక్ష్మణసేనునికి నెట్టి సంబంధమును వారి నిర్ణయమున పొడకట్టదు.

క్రీ.శ. 16 వ శతాబ్దంలో ఉన్న కేశవ మిశ్రుడు తన అలంకార శేఖరంలో

"ప్రాక్ ప్రత్యక్ పృథివీభృతోః షరిషది ప్రఖ్యాత సంఖ్యావతాం
మహనీ యాద్భుత తర్క కర్కశతయా విచ్ఛిద్య విద్యామదమ్
యే కేఽప్యుత్కల భూపతే తవ సభా సంభావితాః పండితాః
పత్రం శ్రీజయదేవ పండిత కవి స్తన్మూర్ధ్ని విన్యస్యతి"

అని చెప్పినాడు. మహారాష్ట్ర భాషలో ఉన్న కవిచరిత్రలో క్రీ.శ. 14 వ శతాబ్దానికి పూర్వము పురుషోత్తమదేవుడు కళింగదేశాన్ని కటకం రాజధానిగా పాలించి, ప్రజా హితాన్ని కోరి, త్రికాండ శేషహారావళి ఏకాక్షర కోశమూ వ్రాసినట్లు ఉన్నది. జగన్నాథస్వామి ఆలయంలోని తాళపత్ర లేఖనాలు (మల్లపంజి) కామార్ణవుడు అనే (క్రీ.శ. 1142-1156) ఉత్కలరాజు నిత్యమూ గీతగోవిందాన్ని వినకుండా భోజనం చేసేవాడు కాడని ఉంది. ఈ కామార్ణవుడు జయదేవుని శిష్యుడూ, సమకాలికుడూ, జయదేవుని గీతగోవిందాన్ని నిత్యమూ జగన్నాథాలయంలో చదవటానికి ఆజ్ఞాపించినవాడు. క్రీ.శ 1180-1190 మధ్యన రాజ్యపాలనం చేసిన రెండవ రాజరాజుకు పురుషోత్తమదేవుడనే నామం ఉన్నట్లు పై లేఖనాలవల్ల తెలుస్తున్నది. అభినవ గీతగోవింద రచనజేసి ఈరాజు జయదేవ గీతగోవిందానికి బదులుగా తన కావ్యాన్ని జగన్నాథస్వామికి వినిపించవలెనని ఆజ్ఞాపించినాడనీ, అందువల్ల ఆనాటి ఉత్కల వైష్ణవలోకం పట్టుపట్టటంవల్ల తిరిగి రాజు జగన్నాథస్వామి కోరిక కారణంగా సంధికి వచ్చి మరల గీతగోవింద పఠనాన్నే ఆదేశించి, గీతగోవిందంలో ప్రతిసర్గాంతములోనూ తన అభినవగీతగోవిందంలోని శ్లోకం ఒకటిఉండేటట్లు చేసుకున్నాడనీ రామదాను దార్ఢ్యభక్తిరసా

మృతము వల్ల వ్యక్తమౌతున్నది. 5 ఈ పరిస్థితి నన్నిటినీ సమన్వయించి శ్రీ కరుణాకర కార్ మహాశయులు మహాకవి జయదేవుడు క్రీ. శ. 12 వ శతాబ్ది వాడని నిశ్చయించినారు.

## జయదేవుని ఇతర రచనలు

జయదేవ మహాకవి ఇతర రచనలను గురించి శ్రీ రాజావెంకటాద్రి అప్పారావు బహద్దురువారి ఆంధ్రాష్టపది పీఠికలో ఇలా ఉన్నది "ఈ కవి యొక్క చంద్రాలోకము, రతిమంజరి, కారకవాదము తత్వచింతామణి అను గ్రంథములు వీరి అసమాన పాండిత్యమును తెల్పును. శృంగార మాధవీయ చంపు, కృష్ణదాసబిరుద నామముతో రచించిన వారీకవియే కావచ్చును" ఇందులో ఉట్టంకితమైన విషయాలను చరిత్రజ్ఞు లంగీకరించటంలేదు. చంద్రాలోకంలో సమాప్తివాక్యం ఇలా కనిపిస్తున్నది. "ఇతి శ్రీపీయూష వర్ష పండిత శ్రీ జయదేవ విరచితే చంద్రాలోకాలంకారే అభిదాన్వరూపాభిధానో నామ దశమో మయూఖః" ఇతడు వంగదేశవాసి. సుమిత్రా మహాదేవుల తనయుడు, ప్రసన్నరాఘవ కర్త. చంద్రాలోకకర్త మహాదేవ తనయుడనటానికి —

---

5 మహీపతి భక్తవిజయంలో సాత్యకి పరంగా కల్పించిన కథకు ఆధారం లేకపోదన్నమాట. గీత గోవిందాన్ని తీసి భక్తులను తన గోవిందకావ్యాన్ని చదవమని నిర్బంధించిన పురుషోత్తమదేవుని వల్లనే అటువంటి అంశం భక్తవిజయంలో ప్రవేశించి ఉంటుంది. అభినవ గీతగోవింద శ్లోకం ఒకటి గీతగోవిందంలో ప్రతిసర్గాంతంలోనూ చేర్చి చదివినారనటం కూడా అభూత కల్పన ఐఉండదు. నిర్ణయసాగర ముద్రాక్షరశాలవారి గీతగోవింద కావ్యం చివరన ద్వాదశసర్గంలో కనిపిస్తున్న

"ఇత్థం కేలితతో విహృత్య యమునా కూలేసమం రాధయా,
తద్రోమావళి మౌక్తికావళియుగే వేణీభ్రమం బిభ్రతి
తత్రాహ్లాది కుచప్రయాగ ఫలయో లిప్సావతో హస్తయోః
వ్యాపారాః పురుషోత్తమస్య దదతు స్ఫీతాం ముదం సంపదమ్" ద్వా. సర్గ.

అన్న శ్లోకం అందువల్లనే ప్రవేశించి ఉంటుందని పండితాభిప్రాయం.

"పీయూష వర్ష ప్రభవం, చంద్రాలోక మనోహరమ్
సుధా నిధాన మాసాద్య, శ్రయధ్వం విబుధా ముదమ్.
జయంతి యాయక శ్రీమాన్మహాదేవాంగ జన్మనః
సూక్తం పీయూష వర్షస్య జయదేవ కవేర్గిరః"-

అన్న వాక్యాలలో ప్రమాణం లభిస్తున్నది. జయదేవ మహాకవి భోజదేవ పుత్రుడు.

గీతగోవిందం జయదేవ మహాకవి రచన లన్నిటిలో ఉత్తమోత్తమ మైనది. కవి దీనిని ప్రబంధమని వ్యవహరించాడు. అద్యంతాలు పరిశీలిస్తే గీతగోవిందంలో ఏక వాక్యత గోచరిస్తుంది. ఆలంకారిక లక్షణాలను అనుసరించి మహాకావ్యమని అనిపించుకోక పోవచ్చును. అయినా ఇది రసవత్తర మహాకావ్యమని అనటానికి ఎటువంటి సందేహమూ లేదు.

"యద్గాంధర్వ కళాసు కౌశల మనుధ్యాయంచ యద్వైష్ణవం
యచ్ఛృంగార వివేక తత్వరచనా కావ్యేషు లీలాయితమ్
తత్సర్వం జయదేవ పండిత కవేః కృష్ణైకతానాత్మనః
సానందాః పరిశోధయంతు సుధియః శ్రీ గీతగోవిందతః"

అన్న వాక్యాలల్లో కవి రాధాకృష్ణుల అన్యోన్య ప్రేమను గానం చేసి అందలి పరమ శృంగారభావంలో విలీనులై కేవలులు కావలసిందని రసికలోకాన్ని హెచ్చరించినాడు. నవ విధభక్తి మార్గాలలో- (1) పితాపుత్ర (2) రక్ష్య రక్షక (3) ఆధారాధేయ (4) శరీరాత్మ (5) జ్ఞాతజ్ఞేయ (6) భోక్తృ భోగ్య (7) స్వస్వామి [8]భార్యభర్తృ [9] శేషశేషి- అష్టమమైన భార్యా భర్తృ భక్తిమార్గం గీతగోవిందంలో నిరూపిత మౌటంవల్ల దీనికి అష్టపది అనే నామం అబ్బి ఉంటుందా?

నేడు గీతగోవిందం జగద్విఖ్యాతి పొందిన మహాగ్రంథం. ఇది బహుకాలం క్రిందనే పాశ్చాత్య దృష్టి నాకర్షించింది. దీనిని సర్ విలియం జోన్సు, ఎడ్విన్ ఆర్నాల్డు మహాశయులు ఆంగ్లభాషలోనికి, లాసన్ లాటిన్ భాషలోనికి, రూకెట్ జర్మన్ భాషలోనికి అనువదించారు. ఉత్కలరాజు గీత

గోవిందాన్ని అనుకరించి అభినవ గీతాగోవిందాన్ని రచించినాడు.6 'సంస్కృత భాషలో గీతగోవింద ప్రభావం వల్ల అనేక 'హర-గౌరులు' 'రామ-సీత'లు జన్మించినవి. అటువంటి వానిలో క్రీ.శ. 15.16 శతాబ్దుల నాటి రాయ రామానందుని జగన్నాథ వల్లభ నాటకము, కృష్ణలీలామృతము [కర్త.వనమాలి, అముద్రితము-15 వ శతాబ్దము]. క్రీ.శ. 17 వ శతాబ్ది నాటి యంత్రీంద్ర రఘునాథసూరి ముకుంద విలాసము [అముద్రితము] ముఖ్యమైనవి. ఒరియాభాషలో పిండిక శ్రీచందనుని [క్రీ.శ.17 వ శతాబ్దము] సంవత్సరము, దిన కృష్ణదాసు [క్రీ.శ. 17 వ శతాబ్దము] అమృత సాగరబోలి, దేవ దుర్లభదాసు క్రీ.శ. 16 వ శతాబ్దము] రహస్యమంజరి మొదలైనవి. అష్టపది ప్రభావం వల్ల జన్మించిన గ్రంథాలు, గీతగోవిందానికి' లభించిన అనన్య సాధారణఖ్యాతి కారణంగా ఒరియా భాషలో దానికి అనేక పద్యకృతులు ప్రభవించినవి. ఈ పద్యానువాదాలల్లో ప్రముఖమైనవి- 1. 1. రసవారిధి- బృందావనదాసు (క్రీ.శ. 15వ శతాబ్దము) 2 గీత గోవిందము ఉద్ధవదాసు [క్రీ.శ 16 వ శతాబ్దము- కమ్మరి] (3) త్రిలోచనాదాసు-గీతగోవిందము క్రీ.శ. 17 వ శతాబ్దము - అంబష్ఠకుడు) (4,5) సదానంద కవి సూర్య, ధనుర్ధర దాసుల గీతగోవిందములు(17వ శతాబ్దము). స్వల్పమైన సంస్కృత వాఖ్యానంతో గద్యానువదితమైన గీతగోవింద ప్రతి ఒకటి కనిపిస్తున్నది. 7

గీతగోవిందం కావ్య బాహ్య స్వరూపాన్ని తిలకించి కొందరు అందులో నిరూపితమైన భక్తి మార్గాన్ని అవగతం చేసుకోలేక కేవలము శృంగార

6 ఈ అభినవ గీతగోవింద ప్రతులు నేటికీ ఉత్కలదేశంలోదొరుకుతూవున్నవి. జగన్నాథ స్వామి ఆలయంలో తిరిగి ఈ గీతగోవిందాన్ని ప్రవేశ పెడతారేమో ననే భయంతో నరసింహ, కపిలేంద్ర ప్రతాప రుద్రదేవులు "కేవలము గీతగోవిందాన్ని మాత్రయే జగన్నాథస్వామి వినవలె నని శాసించినట్లు శాసన ప్రమాణములు కనిపిస్తున్నవట- Vaishnavism in Orissa పే 48.

7 ఆంధ్రభాషలో గీతగోవిందానికి సంపూర్ణమైన అనువాదం శ్రీ రాజా వెంకటాద్రి అప్పారావుగారి ఆంధ్రాష్టపది, ముద్దుపళని కొన్ని అష్టపదులను అనుసరించింది. శ్రీ కోమాండూరి కృష్ణమాచార్యులవారు ఒక అష్టపదికి పద్యానువాదం చేసినారు.

సంబంధమైన అసత్కావ్యంగా పరిగణిస్తున్నారు. అది పొరబాటు. ఒరియా దేశంలో భాగవత సమాజాలు, గీతగోవింద ప్రతి లేనిదే సంకీర్తనలు ప్రారంభించవు, క్రిష్ణాష్టమినాడు కళింగంలోనూ కార్తీక శు-11 నాడు పశ్చిమ భారతంలో వల్లభ శిష్యులూ, గీతగోవిందాన్ని భక్తి తన్మయతతో గానం చేస్తారు. జైనరాజు శ్రీహర్షుడు కూడా 'క్రమసరోవర భ్రమణ సమయంలో గీతగోవిందాన్ని పాడించడం దాని ఆధిక్యానికి మరొక నిదర్శనం. విక్రమసేన మహారాజు సభలో సంగీత విద్వాంసులు గీతగోవిందాన్ని గానంచేసినట్లు చరిత్రలు చెప్తున్నవి.

గీతగోవిందం మొదట పశ్చిమాపభ్రంశభాషలో గానీ. ప్రాచీన వంగభాషలోగానీ పుట్టి, సంస్కృత భాషలోనికి అనువదితమై ఉంటుందని కొందరు విద్వాంసులు సంశయించినారు 8 దీనికి ముఖ్యమైన కారణం అష్టపదులను బోలిన అవపుష్టములను మాత్రాఛందస్సులు ప్రాకృత పింగళములో కనిపించటము.

అష్టపదిలోని కవితను గురించి జయదేవ కవిచెప్పుకొనిన

'యది హరిస్మరణే సరసం మనో
యది విలాస కలాసు కుతూహలమ్
మధుర కోమల కాన్తపదావళీమ్
శృణు తదా జయదేవ సరస్వతీమ్' ప్ర. సర్గ, 3వ, శ్లో.

అన్న వాక్యములు ఎంతో సమంజసమైనవి. భాగవతానికి ద్వాదశ స్కంధాలు వలెనే దీనికి ద్వాదశ సర్గములు. సర్గనామములు సాభిప్రాయములు-సామోద దామోదరము, అక్లేశ కేశవము, ముగ్ధమధుసూదనము ఇత్యాదులు. రసము శృంగారము పది సర్గలవరకు విప్రలంభ శృంగారము, ఏకాదశ ద్వాదశ సర్గలలోని శృంగారము సంభోగము. నాయకుడు గోవిందుడు; నాయిక రాధ.

జయదేవ కవి రాధ ఇంద్రాణి యైనట్లు జయదేవ స్వామి చరిత్రలో ఇలా ఉంది. "తొల్లి ఒకప్పుడు స్వర్గరాజ్య రమయైన ఇంద్రాణి వైకుంఠ ధాముని దర్శించటానికి వెళ్ళి అతని నవమన్మథ మన్మథాకృతి దర్శించినంత

8. మజుందారు గీతగోవిందము అనువాద భూమిక.

మాత్రాన మోహబాణ పాతాలకు పాలై స్వామిని చూచి "ఓ దీనార్తి హరా! నన్ను నీ ఉత్సంగానికి ఆశ్రితురాలిగా చేయవే" అని ప్రార్థించింది. భగవంతుడు ఆమెను చూచి 'నేను సాధుసంత్రాణ శీలుడనై కృష్ణాఖ్యతో భూమిమీద అవతరిస్తాను. నీవు రాధగా జన్మించి నీ మనోరథసిద్ధి పొందుదువుగాక" అని అనుగ్రహించినాడు. 9

గీత గోవిందానికి అనేక వ్యాఖ్యానాలు జన్మించినవి. వాటి అన్నిటిలో కుంభరాణా కృతమైన 'రసికప్రియ' మేలైనదై మైనది. ఈ వ్యాఖ్యానంలో నిరూపితాలైన రాగాలనే కర్ణాటక గాయకులు ఆదరిస్తున్నారు. 10 పెనుగొండ సామ్రాజ్యాధిపతి తిరుమల రాయలకాలంలో గీతగోవిందానికి ఆంధ్రులు ఒక వ్యాఖ్యానం వ్రాసినారు. ఇందు అష్టపదులలో భావములకు నాట్యశాస్త్రము సమన్వయించుట విశేషము. ఆ ఆభావముల కనుగుణములైన అంగన్యాస కరన్యాసాదికములు ఈ వ్యాఖ్యానమున ప్రత్యేకముగా నిరూపితములైనవి.

### పీ యూ ష ల హ రి : జ య దే వు డు

జయదేవకవి కృతమైన 'పీయూషలహరి' నూతనంగా లభించింది 11 ఇది ఒక గోష్ఠిప్రబంధము. సాహిత్య దర్పణంలో చెప్పిఉన్న ఈ గోష్ఠి లక్షణాలల్లో కొన్ని మాత్రమే పీయూష లహరికి పట్టినవి.

"ప్రాకృతైర్నవభిః పుంభి ర్దశభిర్వాప్యలంకృతా
నోదాత్త వచనా గోష్ఠి కైశికీ వృత్తి శాలినీ
హీనగర్భ విమర్శాఖ్యాం పంచషట్యోషి దన్వితా
కామ శృంగార సంయుక్తా స్యా దేకాంక వినిర్మితా"-

సా.ద-షష్ఠ పరిచ్ఛేదం.

'గోష్ఠిలో 9 లేక 10 మంది ప్రాకృత పురుషులు 5 లేక 6 గురు స్త్రీలు ఉంటారు. అంకం ఒకటే. గర్భ విమర్శ సంధులుండవు. ఉదాత్త వచనం ఉండదు. వృత్తి కైశికి, కామశృంగార ప్రధానం. 'పీయూష లహరి' ఇంతకంటే విశిష్టం. గుణోత్తరం.

9 శ్రీ గీతగోవిందం - పీఠిక పే. 7. (సంపాదకుడు. శ్రీ ఎ. వి. నరసింహం పంతులు సం 1911)

10 జయదేవకవి - అష్టపదులు - శ్రీమాన్ వింజమూరి వరాహ నరసింహాచార్యులు, ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, డిసెంబరు 1937, జనవరి 1938.

11 సంస్కృత వ్యాఖ్యానముతోను, ఆంగ్లానువాదముతోను దీనిని శ్రీ కరుణాకర కార్ మహాశయుడు కళింగ చారిత్రక పరిశోధక మండలివారి పత్రికలో సంపాదించి ప్రకటించినారు. సం 1. సంచిక 4 మార్చి 1947)

ప్రాచీనకాలంలో జగన్నాథస్వామి ఆలయంలో అనేకములైన ఏకాంక నాటికలను ప్రదర్శించేవారు. పీయూష లహరిని కూడా అటువంటి నాటక సమాజంతో కలిసి జయదేవుడు ప్రదర్శించినట్లు పీయూష లహరిలోని "గోష్ఠి శ్రీ జయదేవ పండితమణేః సావర్తతే నర్తితుమ్" అన్న వాక్యంవల్ల వ్యక్తమౌతున్నది. ఇటువంటి నాటక సమాజాలు నేడు కూడా అచ్యుతానంద సంప్రదాయులైన వైష్ణవుల్లో కనిపిస్తున్నవి. వీరు రాధను ప్రధాన నాయికగా గ్రహించి జగన్నాథస్వామి ముందు రాసక్రీడలు నలుపుతుంటారు.

పీయూషలహరికి కథావస్తువు గీతగోవింద కథావస్తువే. రాధ ప్రధాన నాయికగా శ్రీకృష్ణుడు రాసలీల నడపటము కథాంశము. అందువల్ల పీయూష లహరిని గీతగోవిందానికి భూమికగా శ్రీకార్ మహాశయుడు అభిప్రాయ పడినాడు.12 దీనినిబట్టి జయదేవకవి ఈ రెండు రచనలను పురస్కరించు కొని రాసలీలా స్వరూపాన్ని పూర్ణంగా ప్రదర్శించినాడని ఊహింపవచ్చును.

కవి స్వోత్కర్షగా చెప్పుకున్న గీతగోవిందంలోని 'సాధ్వీ మాధ్వీక! చింతా న భవతి భవతః' ఇత్యాదులను పోలిన శ్లోకాలు పీయూషలహరిలోనూ కనిపిస్తున్నవి. అందు కొక ఉదాహరణ :

"అశ్మద్రవీకర్తు మిమౌ సమర్థౌ, చతుర్దిశా నామపి పిష్టపానామ్
అహం వచోభి ర్జయదేవ నామా, కరచ్ఛటాభిశ్చ తుషారధామా"

"పరుషాశ్మము గరగించుట, కిరువురకే యనువు గలుగు హృద్యవచో వి
స్ఫురణను నే జయదేవుడ, కరముల చలువను దుషారకరు డొక్కరుడున్" 13

12."The real sportive dance of Krishna (Rasa lila) with Radha at the head of the Gopis is fully shown in Gita-Govinda. This fully confirms that Piyusha Lahari is first and Gita-Govinda is the second part of Rasa lila. Piyusha Lahari is a supplement to Gita-Govinda''

13. డా. ఎక్కిరాల కృష్ణమాచార్యుల అనువాదము.

కృష్ణ భక్త్యైకతాను డైన జయదేవకవి పీయూష లహరీప్రారంభంలో నటరాజు నుద్దేశించి క్రింది నాందీ మంగళ శ్లోకాన్ని చెప్పటం గమనింప దగ్గ విషయం.

"కింజల్క ద్యుతిపుంజ పింజర దళ త్పంకేరుహ శ్రీవహమ్
శంపా సంపతి తాంశు మాంసల శరత్కాదంబినీ డంబరమ్
లాస్యోల్లాసిత చండ తాండవ కళా లీలాయితం సంతతమ్
చక్రప్రక్రమ వృత్త నృత్త హరయో నిర్వ్యాజ మవ్యాత్ జగత్"

"పరితః కేసర పుంజ పింజర దళ త్పంకేరుహాకారమై
దర శంపా రుచిరాంశు మాంసల శరత్కాదంబినీ డంబర
స్ఫురణన్ పర్వత కన్యకా మధు నట త్ఫుల్లాస్య లాస్యాంచితం
బరుదౌ శంకర చండ తాండవము నిర్వ్యాజమ్ము మిమ్మోముతన్ 14.

'కోమలకాంత' పదావళులతో, కైశికీ వృత్త్యుపేతమై, లాస్యోచితమై పీయూష లహరి ప్రాచీన గోష్ఠి ప్రబంధానికి ఒక ప్రముఖ లక్ష్యంగా ఒప్పుతున్నదనటం నిస్సంశయము.

## వైష్ణవం

జగన్నాథస్వామి ఆలయంలో పీయూష లహరిని వసంతంలో రూపించినారు. జయదేవుడు గీత గోవిందంలోనూ, పీయూష లహరిలోనూ నిరూపించిన 'రాసలీల' భాగవత పురాణాన్ని అను సరించింది కాదు. భాగవత రాసలీల శరత్తులో జరుగుతుంది. జయదేవునికి మూలం బ్రహ్మవైవర్తము. అందులో రాసోత్సవాన్ని గురించి కృష్ణ జన్మ ఖండంలో ఇలా ఉంది. "రాసోత్సవం మహద్రమ్యం సర్వేషాం హర్షవర్ధనమ్, పూర్ణచంద్రోదయే నక్తం వసంతే రాసమండలే.........ఏకదా శ్రీ హరిర్నక్తం వనం బృందావనం యయౌ, శుభేశుక్ల త్రయోదశ్యాం పూర్ణ చంద్రోదయే మఘౌ .... యూథికా మాధవీ కుంద మాలతీ పుష్పవాయునా, వాసితం కలనాదేన మధుపానం మనోహరమ్". ఈ రాసలీల మూడు దినాలు మాత్రమే. భాగవత రాసలీల పంచశరద్రాత్రులు. జయదేవుని తరువాత

14. డా. ఎక్కిరాల కృష్ణమాచార్యుల అనువాదము.

జన్మించిన అనేక వైష్ణవ కవులు కూడా ఈ బ్రహ్మవైవర్త రాసమే అనుసరించారు.

జయదేవుని గీతగోవిందమూ, పీయూషలహరీ అర్థం కావటానికి ఒరిస్సా వైష్ణవాన్ని గురించిన విజ్ఞానం కొంత అవసరము. కళింగదేశంలో క్రీ.శ. 8 శతాబ్దములో ప్రవేశించిన మహాయాన బౌద్ధం క్రమంగా వజ్రయాన, సహజయానాలుగా రూపొందింది. క్రీ.శ. 729 నాటి ఒరియారాజు ఇంద్రభూతి, చెల్లెలు లక్ష్మీంకర వల్ల సహజయానం ఆదేశంలో ప్రవేశించిందని ప్రతీతి. ఇంద్రభూతి జ్ఞానసిద్ధిలో జగన్నాథుని బుద్ధదేవునిగా స్తుతించాడు. సహజయానాన్ని ప్రచారం చేసినవారు కౌపవాదులు; ఓఢ్రదేశీయులు. వజ్రయాన సహజయాన వైష్ణవాలు కలిసి ఓఢ్రదేశంలో నూతన వైష్ణవానికి దారితీసి ఉంటవి దానికి ముఖ్యమైన ప్రవక్తలు-- జయదేవుడు రామానంద రాయలు. సహజయాన పంథేయులు జయదేవుణ్ణి ప్రథమ ప్రవక్తగానూ, నవరసికుల్లో ఒకడిని గానూ పరిగణిస్తారు. క్రీ.శ. 15, 16, 17 శతాబ్దాలలోని ఓఢ్ర రచయితలు సరళదాను, బలరామదాను, అచ్యుతానందులు, పీతాంబరుడూ మొదలైన కవులు సహజయానాన్ని అనేక గీతాలలో ప్రశంసించారు.

రామానుజ మధ్వాచార్యు లిరువురూ పూరీ జగన్నాథానికి వెళ్ళి వైష్ణవతత్వాన్ని ప్రచారం చేశారు. తరువాతి వాడైన జయదేవుడు వారి ప్రభావం వల్లనూ, అనాదినుంచీ వస్తూ ఉన్న ఇంద్రభూతి చెల్లెలు తెచ్చిపెట్టిన సహజయాన బౌద్ధ ప్రభావం వల్లనూ నూతన రాధాతత్వాన్ని సాధించి ప్రబోధించినాడు. దానిని స్వీకరించి క్రమంగా అద్వైతాచార్య, ఈశ్వరపూరీలకు గురువైన మహేంద్రపూరి వంగదేశంలో ప్రవేశపెట్టినాడు. ఆయన శిష్యుడైన ఈశ్వరపూరీకి చైతన్యమహాప్రభువు శిష్యుడు. చైతన్యప్రభువు జయదేవుని భక్తి జ్యోతిని అందుకొని వంగవైష్ణవ ప్రపంచాని ఉద్యోతితం చేశాడు. అందువల్ల వంగవైష్ణవానికి ప్రథమ ప్రవక్త జయ్య

దేవుడే అని నిరూపితమౌతున్నది.[15]

అట్టి వైష్ణవభక్తికి 'పీయూష లహరీ' 'గీతగోవింద'ములు ప్రాణ ప్రవాహికలుగా చెప్పదగినవి.

## కృతజ్ఞత

శ్రీ జయదేవకవి విరచిత 'పీయూషలహరి' మూలప్రతి నా కంటబడి నాలుగు దశాబ్దాలు గడిచాయి. కంటబడిందే తడవుగా దీన్నిగూర్చి భారతిలో (వి కృతి - మాఘం) ఒక సుదీర్ఘవ్యాసం వ్రాశాను. అనేక రసజ్ఞుల అభినందన లందాయి.

ఇది మహాకవి జయదేవుని రచన. ఆంధ్రులకు ఇష్టమైన అష్టపదులుగల గీతగోవిందానికి పూర్వరంగమైన గోష్ఠీరూపకం - పీయూష లహరి. తెనుగు చేసిందాకా కునుకు పట్టలేదు; తెనుగుచేశాను-ఆనందంలో ఆవేశంలో.

15. ఈ అభిప్రాయాన్నే సుకుమార సేన్ మహాశయుడు తన వ్రజబోలీ సాహిత్య చరిత్రలో ఈ రీతిగా పలికినాడు,

This outlook of PREMA which we find systematised already in Bhagavata Purana but which does not seem to have affected popular conception of Krishnaism in Bengal up to the 15 th Century A.D. we first come across in Bengal in the life of Mahendra Puri, who was the Guru of Advaitacharya Isvara Puri and other contemporaries of Chaitany Deva. Isvara Puri was the Guru of Chaitanya Deva, so the spirit of Mahendri passed unto Chaitanya Deva, to be devoloped into a wonder ofthe world"-History of Braja Boli literature. P.12

ఆంధ్రులకు ఆవేశ మున్నంతగా ఆలోచన ఉండదని ఒక అపప్రథ. ఆలోచన వుండివుంటే అప్పుడే ఈ అనువాదాన్ని అచ్చువేసి, అందరి అందు బాటులోకి తెచ్చివుండేవాణ్ణి; తేలేదు. అదీ ఒకందుకు మంచిదే అయింది.

నా దగ్గర ఈ అనువాదమూ, దీనికి మూలమూ ఉన్నాయని పసిగట్టిన మిత్రులు — సత్కవి — శ్రీ ఊట్లకొండయ్యగారు. వారిని వెంట బెట్టుకొని, ఉభయ కవి మిత్రులు డా॥ వి. వి. యల్. నరసింహారావుగారు 18-6-1989న, నా దగ్గరకు వచ్చి తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణగా దీన్ని ముద్రించుకొనేందుకు అనుమతికోరారు. అంతకంటే కావలసిం దేముందని 'సరే' నన్నాను. మూలప్రతులూ, అనువాదమూ, భారతిలో ముద్రితమైన పీఠికా రూప వ్యాసమూ అందచేశాను.

కాని డా. నరసింహారావుగారితో ఒక్కమాట అనక తప్పలేదు. 'నేను పీయూషలహరి తెలుగుచేసి దాదాపు నలభైయేళ్ళయింది; ఇప్పుడు నాకు డెబ్భై యేళ్ళు దాటాయి. అనువాదంలోని ఔచిత్యాలనూ, పాఠ పరి పరిష్కారాలనూ సరిచూడవలసిన అవసరం వుంది. ప్రస్తుతం నాకు వాటిని సరిచూచే ఓపిక లేదు. కాని మీరున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయం డైరెక్టరుగా చిరకాలం బహుభాషా గ్రంథాల పరిష్క రణ ప్రచురణల బాధ్యత వహించి, పండిన అనుభవంగలవారు. ఈ పీయూష లహరికి కూడా పాఠ పరిష్కారాది సంపాదకత్వ బాధ్యతలు మీరే వహిం చటం సబబుగా వుంటుంది. తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ విభాగం అధికారిగా ఇది మీ విధికూడా కావచ్చునేమో!' అన్నాను.

అవును; వారు తమ విధిని యథావిధిగా నిర్వర్తించారు.

దాని ఫలితమే ఈ పీయూషలహరి పరిష్కృతప్రతి.

మూలానువాదాలు రెండింటినీ ప్రచురణకు అనుమతించిన తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుల ఉదాత్త సంకల్పానికీ, ఉదారాశయానికీ నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

(సం) శ్రీ వావిలాల సోమయాజులు

శ్రీ జయదేవ కవి విరచిత

# పీయూష లహరి

[గోష్ఠి రూపకము]

అనువాదకుడు

శ్రీ వావిలాల సోమయాజులు

# 'పీయూష లహరి' లో

## పాత్రలు

| | |
|---|---|
| మాధవుడు | నాయకుడు |
| రసాలకుడు | సఖుడు |
| రాధిక | నాయిక |
| నవమాలిక | సఖి |
| ప్రేమకళ | ,, |
| వకుళమాలిక | ,, |

# పీయూష లహరి

## నాంది

ప్రకట కేసరపుంజ పింజర దళత్కనక
పంకేజ విలసనము శంపా మనోజ్ఞాంశు
మధు శరత్కాదంబినీ డంబరోజ్జ్వలము
పార్వతీ మృదునటోల్లాస లాస్యాంచితము
చక్రక్రమోన్నటత్సాంబశివ చండ తాం
డవము నిర్వ్యాజమ్ము క్షేమప్రదమ్ముగుచు
సంపూర్ణదృష్టితో జగము నేలెడుగాత! (1)

క్రీడగా కంపించు చంపకమ్ములు గాలి
దేలి చుంబింపగా లీల దూలెడి నల్ల
కలువపూ సొగసు నొల్కించుచును తేలగా
రాస లీలా విలాసముల లాలసలతో
వల్లవీ పల్లవీకృత వల్గిత జ్యోతి
నిరతమ్ము మా యెదల నెలిమి శోభించుతను. (2)

### నాంద్యంతము

సూత్రధారుడు: [ప్రవేశించి] ఆలస్య మెందులకు ? [పరికించి]
అహో! ఈ మధుమాస మెంత మధురముగా నున్నది!

పంపాసరస్సులో కంపించు నలలలో
పర్వ్యైత్తి చల్లనై సొంపులను జల్లు మ
ల్లీ ముకురములపైన చూరాడి వింతగా
మధుపములు హల్లీసకం బాడ అబ్జముల
సిగ్గువడ చుంబించుచున్ మారుతుడు లతా
బృందమున నాడెడిని మందమందమ్ముగా. (3)

---

(1) ఈ నాందికి డా. ఎక్కిరాల కృష్ణమాచార్యుల పద్యానువాదము పీఠికలోని 15 వ, పేజీలో కలదు.

ఓహో! భాగవతజన శీతమయూఖుడును, నీలాచల మౌళి మండన మణియునయిన గరుడధ్వజుని యనుగ్రహమున నాయన ప్రాసాదమునందు ప్రసన్నులై సామాజికు లెల్లరును గోష్ఠి గావించి యున్నారుగదా! మఱియు నొక విశేషము.

మించు మించిన చిత్ర పృథుచంచలత్వమ్మ
చేతశ్చమత్కార చటుల సంచారమ్మ
పీయూష రుజ్మండలీ స్రవత్ స్వచ్ఛమ్మ
సంచలన్మృగదృశా చలదపాంగమ్మ
ఆనంద సంధాయినియునైన జయదేవ
మహనీయ పండితమణిగోష్ఠి వర్తించు;
మనసార నర్తింప మోహనము రూపకము. (4)

[యవనికవైపు విలోకించి] అహో! నా యీ యల్పకుటుంబ విశేషపేశలత్వము నేమని విన్నవించగలను? ఉదాహృతికి.

పెన్నెరు లెన్నో ప్రియమున నొక్కతె
వెన్నుచునున్నది వంకలు వంకలు;
మంజుల మకరీ శోభల నొక్కతె
కులికెడి కుచముల మలచుచునున్నది;
ఎంతో యందముగా వలయానికి
ఇంకొకకాంత వహించెడి భుజముల;
కన్నుల బెళ్కులు కన్పించెడి నదె
కాటుక నీటుల బోటి యొకర్తుక. (5)

అందువల్ల నేను నైతము పారిపార్శ్వకుని చేత రంగమంగళమును తరంగింపచేయుదును. ఓరి వత్సా, శృంగారకా! ఇటు రమ్మ.

పారిపార్శ్వకుడు: [ప్రవేశించి] భావుకా, (బావా!) ఏమి విజ్ఞాపించుచున్నావు?

సూత్రధారుడు :

విమలులౌ జ్ఞానులకు విపులముగ నమలగతి
చిత్తఖంజన చర్య, రంజనోజ్జ్వలకర్మ
గావింపగాలేనిదౌ నాట్యరంగమ్ము;
ఆ ప్రేమ సంయోగమైన నెద్దియు గాని
దాన గల్గెడు నట్టిదౌ ఫలమ్మది యేమి ? (6)

పారిపార్శ్వకుడు: అయినచో మన కిప్పు డింత భావబంధురమైన ప్రబంధ మెయ్యది?

సూత్రధారుడు :

ప్రణయకోపము గొన్న పడతి పల్కెడి రీతి
వింతవాక్కుల పగిది విన ముచ్చటలు గొలుపు.
ఉరముపైని పటాంతరమునందు క్రీడించు
నురుకుచంబుల రీతి నొప్పు కనుపండువుగ;
అల గవాక్షమునుండి తిలకింప గనుపించు
నమృతాంశు సామ్యమౌ నతివవదనమ్ముల. (7)

పారిపార్శ్వకుడు: [పరీక్షణగా] అంతటి కవి యెవరు ?

సూత్రధారుడు:

"పదునాలుగు భువనమ్ముల
పరుషాశ్మము కరగించుట
కిరువురె కడు శక్తియుతులు—
చతుర వాక్కు జయదేవుడు
అమృతకరుడు శశిదేవుడు."— (8)

అని యనుటకు సమర్థుడు.

(8) దీనికి డా. శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యుల పద్యానువాదము పీఠిక - 14 వ. పేజీలో కలదు.

పారిపార్శ్వకుడు : [నేపథ్యమున కభిముఖుడై] అట్లయినచో గోష్ఠీనర్తనాభినయ కోవిదులయిన కుశీలవులు సిద్ధపడుడు.

[నేపథ్యమున] సఖీ ! ఇటు, ఇటు !

సూత్రధారుడు: [వీక్షించి] ఓహో! అభినేత్రులయిన యీ భరతులది యెంతటి రసావేశము! రంగమంగళము వీణాశూన్యముగానే ప్రారంభించినదే!!

చంద్రకళాకాంతి కరణి
తా శంకావహ యౌగద ;
ఈ పంకజముఖి వచ్చిన
నింకొక సఖి యామె ప్రక్క
మోహపునడకల మెలపుల
రోహిణిగతి నున్నది గద! (9)

ఇక మన ముభయులము మాధవ రసాలకుల భూమికల ననువర్తింతము [ఉభయులు నిష్క్రమింతురు.]

ఇది ప్రస్తావన

[ఇరువురు సఖీమణులు ప్రవేశింతురు]

ఒకతె:

ఓహో, ఓ వామాక్షీ! ఉజ్జ్వలుడౌ మాధవుండు
వల్లవీ ప్రపంచమందు పంచమమున నాలపించి
మోహపరచకుండు నెవరి మానసంబు వంచకుండు? (10)

మఱియొకతె: అవునే ఓ రాధికాసఖీ! నిన్ను బోలినవారి విషయము వచింప నవసరము లేదు.

వెచ్చందనంబునకు నొచ్చి నిశ్వాసములు
చెక్కిళ్ళపై జేరి చందనాకులతమెయి
కర్పూర జలధిలో గలుగునట్లుగ పొందీ
మమున మగ్నంబయ్యె: మృదులమౌ తనుశోభ
కార్శ్యంబు నేర్పె నిదె కౌనుదీవియకు శుష్య
చ్చంద్ర రేఖాచ్ఛవిని చారు తర సుందరీ!
నంద నందన రూప సౌందర్య సౌభాగ్య
శోభలను గ్రోలినవె, శుభ్రములు నీకనులు? (11)

రాధిక : సఖీ, నవమాలికా! ఈ యాకాశ లేఖినీ వర్ణన మెందు కారంభించుచున్నావు?

నవమాలిక : నిను బోలిన సుముఖుల కెటు
లనురాగము దాగు నెదల?
ఇరుల–వల్లరుల డాగిన
విరుల సౌరభములు వీచు. [12]

రాధిక: ఇక నా రెండవ ప్రాణమ వయిన నీ యొద్ద దాపరిక మెందుకు? వినిపింతును.

ఏ తరిని కేశవుం డింపుగా వేణువును
మంద మృదు ధోరణుల నొంది యూదగ నెంచు
నపుడు పద్మాయతాక్షుల యాత్మలందు మద
నార్తి హేతువుగాగ నూర్చె వేడిమిఁయూర్పు
లధరాళి మ్లానిమను నందముగ రూపించు:
అంతేకాదు.

హర్ష యోగ్యమ్ము కేదారరాగమునందు
మధురముగ స్రవియించు మంజుమురళీ స్వనము;
పద సరోజ స్వర్ణకటక నిర్వాణ మే
వియు నింత మోహనమ్ముగ జెలంగగ లేదు. (14)

నవమాలిక: [పరీక్షగా జూచి శిరసు నించుక యూపుచు] తెరలో నుండి ఎవరో రాధికాలోచనములను మూయుచున్నారు.

రాధిక: [సీత్కారముతో]

ఓ రతి లంపట మానస,
ఓ మాధవ, ఇది యేమిటి?
కన్నుల చలియింప జేయు
కరతలముల దొలగింపుము;
పరమభక్తి షట్పదమై
పాదపద్మ సేవికగా
ఓ మురారి! ఇదిగో నీ
రాధిక, ఇదిగో, యిట నున్నది. (15)

సఖి: [రాధికాచిబుకమును పైకెత్తి] నీ సతీవ్రత మాహాత్మ్యమిదియేనా?

రాధిక: [లజ్జచే మోము వంచి] సఖీ! భ్రమచే నిట్లంటిని.

సఖి: సఖీ! కాదు. కాదు. విభ్రమముచే నంటి ననుము.

రాధిక:

పేశలము రమ్యమ్ము నాసికాభూషణము.
కుండలమనోజ్ఞ మండితము గండస్థలము.
నవనీలకుంతల వికుంచితము పింఛమ్ము.
ముల్లోక మోహన తమాల నీలిమను, కాం
చీ పటముతో వెలయు మాధవుడు, ప్రణయపతి,
ప్రాణమును మించు మాధుర్యమని యనిపించు. (16)

సఖి : ఎక్కువయా ? అందఱకు నెక్కువయే. అయినను కులాంగ
నలకు నిందాపరుల పిశాచతాండవ జిహ్వను నివారించుట
సముచితము సుమా!

రాధిక : సఖీ! నవమాలికా!విషమసాయక బాణపాతము వలన గలి
గిన మర్మవ్యథ నీ వంటిదాని కేమి తెలియును? అవసర
మైన యెడ ప్రేమకళ నడుగుము.

ప్రేమకళ: గురుభీతియు, జననిందయు
ముమ్మాటికి జేరనటుల
పతిభ కికి రక్షసేయ
ప్రతిన సేయవలయు గదా!
మరచితివే, ఓ సఖియా!
మానితివే మరి నీవది;
విభుని లేత చిబుకమ్ముల
నూటలూరు మృదు పవనము
లూదెడు వంశీస్వనములు
ధీ పాటవ విశ్లథత్వ
మిడవచ్చును మందముగా. (17)

రాధిక : [వంశీనాద మాలించి ప్రేమావస్థ నభినయించును]

ప్రేమకళ : పులకలను నెడనెడను బొటమరించిన చెక్కు
కుల నిగ్గుతోడి మధుశీత్కృతావళులతో
ముఖసరోజము కాగ ముగ్ధరుచికోశమ్ము
కుచకాంచనాద్రులను ద్రవియింప ముచ్చెమట
మదనహేతి విఘాత భీతవై, సకియరో,
పలుమారు దీనముగ వడకెద విదేలనే? (18)

రాధిక : [నీవీ సంయమము నభినయించును]

నవమాలిక: [హాసమొనర్చుచు]

ఓహోహో పృథునితంబ, ఓహో ఓ కోమలాంగి!
నీవీ బంధన చతురిమ కేల యింత శ్రమపడెదవు?
పీతాంబరుడై మురహరి స్మిత మధుర ప్రియవీక్షణ
మొనరింపగ నిలువలేక లొంగి బద్ధవై పోవా? (19)

రాధిక: [నవమాలికను విలోకించి యానందముతో]

ఓహోహో, హరిమురళీ
సుస్వనోహ లూర్జితములు!
వరసతులకు గలిగె నవే
చికుర పాళి పులకలు చెలి !!

నవమాలిక: [లజ్జచేత మోము వంచుకొని స్వగతముగ]

కాంచన మృదువసనధారి, శ్యామల తనుకాంతియుతుడు,
గోపాలుడు కనుపింపడు; ఏ విభు నేత్రాంచలమ్ము
లేపుజూపు సమయమ్మున పూర్ణేందుడు మృగనయనల
పై జల్లెడు తిందుక పావకము, మృత్యువిహరణములు
మలయజగంధములు తాపకందళములు, బ్రతికె వారి
శాత్రవు, డిక కంఠమాల యమవార్తావహ యగునా!
ఆ మురహరి, మాధవుండు, ఆ సుందరగోపాలుడు
ఎయ్యెడ గనుపింపడు, మరి యీ తలిర్చు దశ లేమో! (21

లేక, యొకవేళ

విషమాస్త్రి డిడిన యరిత్రాడు మురహరుని వం
శీ నినాద మ్మెపుడు తరుణ వనితల క్రమ
కంఠముల నిరికెనో యపుడు పులకల గండ
పాళితో జిక్కినది సౌభాగ్య బంధనము, (22

[నేపథ్యమున]

దేవతల పైడిమకుటాల వెలుగుల నొరసి
యెవ్వాని శ్రీపాదకంజములు కందినవొ
యాతడే మన్మథ విరాళిగొను వ్రజకాంత
లను మనువు, రాగరసిక శ్రేష్ఠ వ్రజరాజు
గని కొలిచెదను నేను పరమ ప్రణయమ్ముతో. (23)

ప్రేమకళ : రసాలకుడు హస్తగత చిత్ర ఫలకముతో నిటె వచ్చుచున్నాడు.

రసాలకుడు : [వర్ణితు డయినట్లు ప్రవేశించి]
తారహార సుందరు ఘను
నీల నీరదోరు ధాము
పాలితువలె లీల గొలుతు;
వామనీకృత స్తసాంత
వల్లవీ నికామ కామ
నీతిరసికు ప్రేమ గొలుతు. 24

రాధిక : ఈ రసాలకుని హస్తమునందున్న యీ చిత్ర ఫలకమే సర్వానర్థ కందళములకును మూలకందము.

నవమాలిక : సఖీ! నీవే దీని నంకురింపజేసితివి. "దీనిని వకుళమాలిక చేతి కీయవల"దని నేను ముందే వచించితిని కదా!

ప్రేమకళ : సఖీ, రాధికా! చపలత్వముచేత నది దాని నెటనో పారవైచియుండును. దాని నిప్పుడీ వటువు గైకొని నాడు. మరి యిప్పుడు మనము దీనిని గ్రహించు టెట్లు?

రాధిక : నే నిప్పు డీ విషయమునే యోజించుచున్నాను. ఎట్లయి నను సరియే ; కాని యిది మాత్రము గోవిందకరా రవింద మరందముచే నభిషిక్తము కారాదు.

నవమాలిక : అనుమానమేల? అట్లగుట నిశ్చయము.

రాధిక : ఫలితమును బట్టి నిర్ణయ మొనర్తము లెమ్ము.

రసాలకుడు : [ప్రవేశించి] కుశలమగుగాక! [చిత్ర ఫలకమును సమర్పించును]

అందఱును: [ఫలకమును జూచి]

చిరు చంద్రకళ వెటుల నెరబాటు నోర్చుకొని
త ప్తచింతామణివిగా నిర్చితివి నీవు ;
మదన దారుణ తాపధాటి కెటో మేమే చ
కోరముల భాతి చిత్తోద్వేగమున చోర
గతి జేరి నిను, దారటాడితిమి తన్వీరో!
నిండుగా గర్పించు నిది యెల్ల నచ్చెరువు. (25

సఖి: ఈ మురారి రూప క్లోతనము విన్ను గూర్చియే.
(అందఱు "కాదు, కాదు నిన్ను గూర్చియే" అ
కలహింతురు.)

ప్రేమకళ : (ఆత్మగతముగ)
పాదద్వయమ్ము నూపురపూరితమ్ముగను,
కటితటిని పీతాంబరాలంబనమ్ముగను,
వక్షమున కుంకుమము, వేణుస్వనమునందు
నందనరసస్యంది, అమృతారుణోష్ఠమున
ప్రసరించు హసనమ్ము, పించచూడమ్ముతో
విభ్రమము వెలయు నా నీలమేఘము నొంద
నెవ రౌనర్చిరో కదా, యింత ఘనతర తపము? (

(నేపథ్యమున)

"రాకా శీత మయూఖుని బోలెడు
సుందర వదనుడు, విస్ఫారోన్నత
వక్షఃస్థలుడును, ఖేలత్కేసరి
మధ్యముడును, మదగజరాడ్గర్వా
పహుడును మరకత సంపద్దోర్దం
బరుడౌ శ్రీపతి రమ్యాకారుం
డెవ్వరి రంజింపఁ డీ సృష్టిని?" (27)

ప్రేమకళ : (దర్శించుట నటించి) నీలోత్పలమును మాటిమాటికి హృదయమునకు హత్తుకొనుచు వకుళ మాలిక సంబ రముతో మురిసిపోవుచు ఇటే వచ్చుచున్నది :

వకుళమాలిక : (వర్ణితమైనట్లు ప్రవేశించి)
ముగ్ధమోహన మంజులమ్మగు
మధుర తరళిమ సరణిలో మధు
తృప్త చుంబన కళల పోలిక
తొగరు పెదవుల నెగయు సుధలో
మురళిరవళులు తొలకరించెను;
చేతనమ్ములు పులకరించెను.
అలలు తేరిన కలతదీరిన
మురళి తరళిమ సరళిలో చిఱు
తొగరు పెదవుల నెగయు సుధలో
పులకరించెను రసిక వాహిని. (28)

(వీక్షించి) ఓహో, ఈ పొగడ చెట్టు వైపుననే సఖుడు. రసాలకుడు వెంటరాగా రాధిక యనురాగకళికను వికసింప జేసికొనుచున్నది, నేనును సంభావించెదను.

రాధిక : (సమీపించి) ఈ యవతంస నీలోత్పలము నింతగా సంభావింతు వేమి విశేషము?

వకుళమాలిక : (రాధికచెవి దగ్గరకు జేరి)
ఉజ్జ్వలోత్పల కోరకమ్మది
యుండ నేకాంతముగ నీతో
నవ్యతను తా నందనందన
నయన నీతి వినిర్జితమ్మై
నందసూను శ్రవఃకపోలము
విడిచి భృగుపాతమ్ము నొందెనె! (29)

రాధిక : సఖీ ! ఈ కర్ణావతంసముచేత బ్రతికితిని.

నవమాలిక : సఖీ! అలంకరింపబడిన కృష్ణునిచేతనా ?

(ఆ కా శ ము న)
ఓహో, మురారి మురళి ! ఉరునాంది మధుసరళి !!
రాసోత్సవ నాటికలో జగముల ప్రస్తావించును;
మునివర్యుల హృదయములను ముగ్ధభావవశ మొనర్చు. (30)

అందఱును : (ఆనందముతో) నిజము! నిజము !! (మదనావస్థ నటింతురు)

రసాలకుడు : (పులకించి, అంజలి వహించి)
ఒక్క వాక్కుకు, మనసు కొదుగంగ బోనిదియు
ఒక్క యాకారమని యొప్పుకొనబోనిదియు
వల్లవీ తరళ నేత్రాపాంగముల చేత
వల్లవీకృత వస్తు వాశ్రయించెద నేను. (31)

(విలోకించి)

గోపీ మనోహారిణీ సూత్రధారియై,
కందర్ప బాణముల కాందిశీకునివోలె
నవ్య నందనమైన బృందావనమునందు
నందసూనుడు వేణు నాదమ్ము లాలికించె. (32)

నవమాలిక :

ప్రాలేయాంశుని శోభల
పరిహసించు ముఖజలజము
సతులకు నీవీ విదళన
ముల గూర్చెడి మోహవిద్య
ప్రణయమ్ములు కడు క్రుమ్మివ
గుల్మము చాటున మసలుచు
నిరుపముడౌ నీలకాంతి
పరిణత మధు సారణిగా
బృందావన కుహరమెల్ల
నానందోజ్జ్వలత గ్రమ్మ. 33

రసాలకుడు : ఈ లతలలో పొంచియుండి రాసోత్సవమును దర్శింతును.

(నిర్దేశించిన రీతిని మాధవుని ప్రవేశము)

మాధవుడు : వీ రందఱును నా సన్నిధిని జేరుచున్నారుగదా! నేను నిమిషమాత్రము ధైర్య మవలంబించెదను.

(అందఱును సామీప్యమును జేరుదురు)

మాధవుడు: (రాధిక నుద్దేశించి)

అసితోత్పల క్రమ కుసుమ కర్ణాలంకరణములను,
లలిత నీల వసనాంచిత రమ్య పీవరోరువులను,
చేలము ప్రక్కన సగముగ చెలగు బాహుమూలములను
నొప్పెడి యీసుముఖి సొగసు కామమోహవిద్యగదా! 34

(అంత ప్రేమకళ నుద్దేశించి)

పంకేరుహ హాసననేత్ర ! స్పందించెడు నీ పరిణత
భ్రూవల్ల్యపదేశమ్మున పుష్పబాణచాపమ్మును;
ఈ చిత్తజహేళి ప్రియ సిందూరపు జేరుచుక్క
యసమాస్త్రుని కదనగుళిక యను శంకను గలిగించెడు. 35

(వకుళమాల నాశ్రయించి) నే నిచ్చటనే డాగి భావముల పరీక్షింతును.
(అట్లొనర్చును)

రాధిక : ఏమిది? మాధవు డిక్కడనే యెక్కడనో యంత రితుడై (మఱుగుపడి) యున్నాడే!

అందఱు : (పరికింతురు)

రాధిక : [బాగుగా పరికించి]
వినమితేంద్రమౌళి మకుట శేఖరత్వమును గొన్నది.
వ్రజకన్యా కుచకుంభ నిగూఢ మృగీమద పంకై
శ్వర్యముచే శ్యామలమ్ము, వార్ధిపుత్రీ విలసిత
వర దీధితి గైకొన్నది. నీప వృక్ష మూలమ్మున
లభియించిన నాదు పురామణి కాన్పించియె. అయ్యయో!
మహితముగా జారిపోయె; మోసగించి పారిపోయె. 36

వకుళ మాల: [ఆత్మగతముగ]
ప్రాణములు వీడగా బ్రతుకలేరే నరులు
ప్రాణాధికము విడువ బ్రతికియుంటిని ; వింత !

[అందరు వియోగావస్థ నభినయింతురు]
అంగుళీ వదనముల నా చెక్కిళల నూని
శృంగారమున నర్ధచుంబనము గావించు;
వ్రజనాథులీల నాస్మృతి దవిలినంతనే
ప్రతి నిమేషమునందు ప్రాణముల్ చుంభించు. 3

నవమాలిక : [చంద్రుని విలోకించి]
విరహిణులను వేచు స్మరుడు,
వ్రజయువతీ తతి జ్వలింప
అరుణ నవ్య కిరణము లా
యగ్ని జ్వాలల పోలిక

ఘన ధూళీ లక్ష్మవల్లి
ధూమమౌచు నెసగెడు నా
హోమకుండమును బోలిన
చంద్రమండలమున కొసగి 39

ప్రేమకళ : దీని నవధరించుచున్నాను.
భర్గు ఫాలనేత్రాగ్నికి నర్ధముగా దగ్ధమైన
కుసుమాయుధు దేహ మిప్ప డీ మార్గము తిలకించుచు
కృష్ణసార బిందువు మాటున చల్లందనము నొంది
శీతకిరణుడౌ శశియను నమృతతటాకపు జలతతి
పూర్ణ శరీరముగా నై ప్రసవాస్త్రమ్ముల నిటు మన
పై దూసిన రీతి దోచు పరమ కళానిపుణతతో. 40

రాధిక : [సవితర్కముగ]
శశిబింబము కా దయ్యది
స్వర్గాధిపు మదగజమౌ;
ధృతదంతము మదమత్తము;
ఆ నీలకళంకవల్లి
మదధారల చారికలే ! 41

ప్రేమకళ: అంతరిక్ష మార్జించును గాసారపు క్రమశోభ
నక్షత్రము లౌలయు నిదే నళినీ సుమసౌందర్యము;
కిరణ మృణాళీ వల్లరి శశిబింబమ్మగు మూలము
నీలబిందు వేషమ్మున లీల ఖనన మొనరించెడి;
ఇది చంద్రుని మచ్చకాదు; ఎట వచ్చినదో పోత్రి? 42

నవమాలిక: గాఢ మదాలస విలాసినీ రద కాంతిచ్ఛట యనగ
వైహాసిక దరహాస క్షరకిరణచ్ఛవి యనగా
చలిత తరళమౌ రోహిణి మండలమ్ము వండినదవ
రసవికాసమను మధువును రజనీపతి స్రవియించెడి. 43

రాధిక : [పవనస్పర్శ నభినయించి]
చింద బడెడి పెనుమంటల నాందోళన తరళన్నవ
చందనదళ వసనాంచల మదనానిలు డుమినెడి, నోహో!
భర్గుని కోపాగ్ని శిఖిల భగ్గురనిన బంచశరుడె
మందానిలుడై యివ్విధి జిందెడునే పెనుమంటలు! 44

అందఱు : ఓ తమాలకృత మాలా హింతాల రసాలసాల
వకుళార్జున ప్రముఖములే తరుణముగ్ధ తరుచయమా!
ఎఱిగినచో నవనంద కిశోరుమార్గ మెఱిగింపుడు
నేత్రాంచల కువలయముల నిష్ఠమెయిని బూజింతుము. 45

ప్రేమకళ: [వంశి నుద్దేశించి సానుక్రోశముగా]
ఏకాకినివై యెపుడును మురరిపు బింబాధరముల
ముద్దుగొనెడి యొద్దిక నీ వశమైనది యో మురళీ!
ఫలియించెను నీ తపమ్ము; పరులకెపుడు దుర్లభ మిది. 46

వకుళమాల: [ఆకాశము వంకకు నిబద్ధము గావింపబడినయంజలితో]
ఆలోల సుమకుంతలమును, పింఛ
ప్రాంచ త్పింఛర సౌభాగ్యమ్ము
మల్లీయుత సీమంత కళాన్విత
ఘర్మిలసుసోమము, శోభితమౌ
నీ హసితాననమును నొకపరి
చూపించిన, చాలును త్రిదశాధీశా!
ఇంచుక చూపుము నీకారుణ్యము
ఇచ్చెద సర్వము నీకే స్వామీ! 47

ప్రేమకళ: అధిక సంతపలో హరిణాక్షు లహహా! మా
నేత్రాంతములను ప్రాణమ్ములను గనలేరె?
అలముకొను కార్పణ్యమందైన నో ప్రభూ!
నిబిడ మౌగాదె యెంతయు నీ దయారసము? 48

నవమాలిక: నిలుపవేని నాపై నీ నిర్మల కరుణా వీక్షణ
ఓ సమస్త జగదీశా !, ఓ దయాంబు ఘనరాశీ !!
యోగనిద్ర వీడదు నీ నేత్ర ముగ్ధ జలజమ్ముల
నిపుడైనను నా పాపము లెంతగనో హేతువుగా! 49

అందరు : [అంజలి బంధముతో]
మురళీరవ తరళీకృత
విలసిత నీరజ వదనుడు,
నీలదేహ నిరుపముడును
గోపాలీ నందనుండు
మహిళా మానస హారియు,
మందహాస ముగ్ధముఖుడు
నై నయతని కన్నమేము
కన నెరుంగ మన్య నెవని. 50

కొందరు: నిరుపమ మగు నాకులతను నీ దాసీగణము పొంద
వీక్షింపవె నాథ నీవు? ఎందుకు నీయెద క్రోధము?
హింసింతువ స్త్రీల నిటుల; నేమి ఫల మ్మార్జింతువు? 51

[నేపథ్యమున]

మధుర యానమ్ముతో మధుజగత్పతి వచ్చె;
అరవిందలోచనా మకరంద నవబిందు
లోచనాంచల చకోరానంద చంద్రముడు;
మదమత్త దరహాస సారమంజుల ముఖుడు
పరివీత పీతాంబరము ధరించినవాడు
మధు జగత్పతి వచ్చె మధుర యానమ్ముతో. 52

అందరు: [స్వాగతముగ]
మందయానముతోడ గోవిందు డేతేర

ఫాలలోచనువహ్ని భగ్నుడైనట్టి యా
పంచబాణుడు నేడు పంచత్వమును వీడి
లోకోపకారియై తులకించి పులకింప
నభిరూప రూపియై యరుదెంచి స్వనియించె. 53

వచ్చుచున్నాము. రండు. పోవుదము [మాధవ
సామీప్యమును జేరుదురు.]

రసాలకుడు : ఇక నేనును గనుపించెదను. [సమీపించును]

మాధవుడు : మీ కేమి ప్రియ మొనర్తును?

అందరు : ఇంతకన్న ప్రియ మేమున్నది?

ఇంతకంటె తృప్తికరము లేమున్నవి గోవిందా!
మందపవన ఖేలాందోళన పులకిత రసికములగు
నళినపత్ర సమములు నీ నవతాయుత నయనమ్ములు.
అమృత సరళ సారాంచిత రాగఝరిని పోలెడు నీ
నిభృత మధుర నిస్వనములు, నిత్యముగ్ధ సుస్వరములు.
క్రీడాత్మక గతి నటించు నటనాఘటనములియ్యవి;
కడు ఘనముగ పెంపొందించెడు నౌజ్జ్వల్యములియ్యవి.
54

అయిన నిదియును జరుగుగాక!
హరిణమ్ములేని పీయూషకిరణుని యంద
మును జిందు కాంతిని తిరస్కరణ గావించు
వాక్ప్రౌఢి మన కవులు కడు గాంచెదరుగాక!
సజ్జన సమూహమ్ము నిత్యరసపానసం

జనితతన్మయతతో చిన్మయతతో సత్వ
ఘర్మవా స్సరణితో నంతు లెరుగగ రావి
యానందజలనిధుల కడు నొందెదరుగాక। 55

సకల జగమ్ములనిరతము
శుభములు ప్రాప్తించుగాక ।
రిపులకైన నపకారము
లెపుడు కలుగకుండుగాక ।।
సర్వేశుడు జగదీశుడు
కపటదారు విగ్రహ వే
షమ్మున కరుణాకటాక్ష
వీక్షణలహరీ తరంగ
ప్రసరణలను. బహుగతులను
ప్రణయముతో పంపుగాక । 56

శ్రీ జయదేవ విరచిత పీయూషలహరీ నామ
గోష్ఠీ రూపకము
సమాప్తము.

*

# శ్రీ జయదేవ కవి విరచితా

# పీయూష లహరీ

[సంస్కృత మూలము]

# శ్రీ జయదేవ విరచితా
# పీయూష లహరీ

కింజల్క ద్యుతి పుంజ పింజరదళత్ పంకేరుహ శ్రీవహామ్
కంపా సంపతితాంశు మాంసల శరత్కాదంబినీ, డంబరమ్
లాస్యో[1]ల్లాసిత చండ తాండవకళా లీలాయితం సంతతమ్,
చక్రప్రక్రమ వృత్త[2] నృత్త[3] హరయోర్నిర్వ్యాజ మవ్యాం జగత్. 1
కంపమాన నవ చంపకావళీ చుంబితోత్పల[4] సహోదరోదయం,
రాస[5]లాలస నవీనపల్లవీ పల్లవీకృత ముపాస్మహే మహః. 2

సూత్రధార– ఆలమతి విస్తరేణ (విలోక్య) అర్య మతిమధురో మధుమాసః యత్రహి[6]

మరుత్కంపా కంపాకుల లహరి సంపాత శిశిరః
స్ఫురన్మల్లీ వల్లీ[7] కుసుమపుట హల్లీసక నటః,
నమన్నాశీర్మధుర మధుపాళీః కవలయ
న్నయం మందం మందం తరళతరుబృందం ప్రసరతి. 3

అహా భగవతో భాగవతజన శీతమయూఖస్య[8] నీలాచలమౌళి మండన మణే[9]గరుడ ధ్వజస్య ప్రసాదే ప్రసాదమిళితాః[10] సామాజికాః
(కించ)–

---

1. రాసో 2. వృత్తి 3. నృత్య 4. కోమలోత్పల 5. లాస్య
6. అత్రహి 7. స్ఫురన్నాళికాళీ 8. చకోరశీతమయూఖస్య
9. మండలమహానీలమణేః 10. లలితా

చిత్రం చంచల చంచలేవ చటులా చేతశ్చమత్కారిణీ
పీయూషద్యుతి మండలీవ మధురస్వచ్ఛ ప్రవాహచ్ఛటా,
దృగ్భంగీవ కురంగ భంగుర దృశా మానంద సందాయినీ
గోష్ఠీ శ్రీజయదేవ పండితమణేః[1] సావర్తతే వర్తితుమ్. 4

(నేపథ్యాభిముఖ మవలోక్య)

అహో! విశేష[2] పేశలత్వ మస్మత్కుటుంబస్య
తథాహి–

కాచి న్నయతి కుటిలయ త్యలకా మకాండే
కాచి త్కరోతి కుచయో ర్మకరీ విలాసమ్,
కాచి త్కరోతి కలయా వలయాన్ భుజాన్తే
కాచి ద్దృగంజన మతీవ కరోతి సూక్ష్మమ్. 5

తత్పారిపార్శ్వకేన తరంగయామి రంగమండల[3] మితి,
వత్స శృంగారక! ఇత ఇతః (ప్రవిశ్య)

పారిపార్శ్వకః– భావ! కిం విజ్ఞాపయసి[4]?

సూత్రధార– కిం తేన నాట్యరంగేణ ప్రేమసంగేన[5] వా పునః,
నకృతం యేన విజ్ఞస్య చిత్తఖంజన గంజనమ్.[6] 6

పారిపార్శ్వకః–కః పునరేతాదృశో భావబంధురః ప్రబంధః?

సూత్రధార– కుప్యత్కాంతముఖీవచోలవయివ ప్రత్యర్ణకర్ణోత్సవః
ఖేలచ్ఛైల దరోదిత స్తన ఇవ ప్రేమాస్పదం నేత్రయోః,
లీలా వేశ్మగవాక్ష లక్షిత వధూ వక్త్రేందువన్మాదకో
గోష్ఠీరూపక రూపవర్తన కళా రంగాయ మున్మీలతి.7

పారిపార్శ్వకః–(సానుబంధం)[7] కః పునరపి కవిః?

---

1. పండితకవేః. 2. పేశ. 3. రంగమంగళ, 4. కింకిం జ్ఞాపయసి. కి మాజ్ఞాపయసి 5. ప్రేమరంగేణ 6. చిత్తఖంజన నందనమ్, చిత్తఖంజన బంధనమ్ 7. సానుసంధానమ్

సూత్రధార- ఏనైతదుక్తం
అస్మద్రవీకరు మిమౌ సమర్థౌ
చతుర్దశానామపి విష్టపానామ్,
అహం వచోభి ర్జయదేవనామా
కరచ్ఛటాభిశ్చ తుషారధామా[1]. 8

పారిపార్శ్వకః- (నేపథ్యాభిముఖం) తేన సజ్జనా గోష్ఠీ న ర్తనాభినయకోవిదాః కుశీలవాః (నేపథ్యే) సఖి ఇత ఇతః

సూత్ర- (విలోక్య)[2] రసావేశో భరతానాం. యత్ర అహో ఖలు వినైవ నాళికాం[3] రంగమంగళ మవతరతి. (విభావ్య)
ఇయం చంద్రకళా శంకే పంకేరుహముఖీపురః,
ఏతస్యాః పార్శ్వగా కాపి రోహిణీవ విరాజతే. 9

తదావామపి[4] మాధవ రసాలయో ర్భూమికాం సంపాదయావః

(ఇతి నిష్క్రాంతౌ)

ప్రస్తావనా

(తతః ప్రవిశతః సఖ్యౌ)

ప్రథమా- కస్య వా పశ్య వామాక్షి! మాధవో మధురోదయః[5],
ఉదంచ త్పంచమాలాపై ర్నమోహయతి మానసమ్. 10

అపరా- సఖి రాధికే! ఏవ మేతత్. కింతు భవాదృశీనామ్ ?
తథాహి-

శ్వాసాస్తాప సమాకులా ఇవ బహిర్నిర్యాంతి గండాంతికమ్
యత్కర్పూరపయోనిధావివ[6] పరం పాండిమ్నిమగ్నా రుచిః,
చ్చైవేషా తనువల్లరీ విజయతే లేఖేవ శైషెందవీ
తత్కిం సుందరి! నందనందన తనుచ్ఛాయా
సమాయాద్దృశోః 11

1. తుషారధామాచకరచ్ఛయభిః 2. విలోక్య ఇతిపాఠోనాస్తి 3. నాందికాం-నాయికాం 4. ఇదానీమపి, తదానీమపి 5. మధురాలయః 6. వపి

రాధికా— సఖి నవమాలికే! కిమిద మాకాశ లేఖనీవర్ణన[1] మారభసే!

నవమాలికా—అనురాగః సుముఖీనాం చేతసి గుప్తోఽపి లక్ష్యతే సకలైః. సౌరభ మంజతి పరితోయద్యపి కుసుమం లతావృతం భవతి. 12

రాధికా— కింనామ గోపనీయం భవత్యాఽపి ద్వితీయాత్మనః?

యావత్ యావన్మధుర మురళీపూరణార్థం మురారి
ర్మందం మందం వదన పవనాసంగ మంగీకరోతి.
తావత్ తావత్ కువలయ దృశాం మన్మథక్లేశజన్మా
నిశ్వాసోఽయం దశన వసనే[2] గ్లాని మానం తనోతి. 13

సహ్యేస్యాత్[3] వహాళీభవిష్ణు మురళీకేదారతార శ్రుతి
ర్నైతాదృగ్ చరణార విందకటక క్వాణోఽపి సమ్మోహనః.
కిన్నుకాన కపోలకాళి వలయ ప్రస్యంది మందస్మితై
ర్గోవిందః శతధా భినత్తి హృదయం ధైర్యస్పృశాం మాదృశామ్. 14

నవమాలికా—(సునిభృతం పశ్యన్తి మూర్ధామీషద్దోలయతి) తతః అకాపిదీదోషేణ రాధికాయాపలోచనే ముద్రయతి[1]

రాధికా— (ససీత్కారం)[4]

ఇయమియం తవమాధవరాధికా
చరణపంకజ సేవన[5]షట్పదీ.
బహిరుదంచయ కింతవ[6] నేత్రయోః
కరతలం రతిలంపటమానస.[7] 15

---

1. లేఖవర్ణన, 2. రదన వసన, 3. సద్భాషా. 4. సచీత్కారం
5. సేవక 6. చంచల 7. రతిలంపటమానసమ్

సఖీ — (చిబుక మున్నమయ్య) ఈదృశం తే సతీవ్రత మాహాత్మ్యమ్?

రాధికా— (సలజ్జ మధోముఖీభూయ) సఖి! భ్రమా దుక్తమ్.

నవమాలికా—నహినహి సఖి! విభ్రమాదిత్యుచ్యతామ్.

రాధికా — కింబహునా—

పింఛాలాంఛితకుంతల[1] వ్యతికర స్తాపింఛగుచ్ఛచ్ఛవి[2]
ర్నాసాభూషణ పేశలీ గతివశా ద్గండోల్ల సత్కుండలః.
కాంచీమండలకుంచితాంబరధరో లోకత్రయీ మోహనః
సర్వస్మాదపి జీవితాదపి మమ ప్రేమాస్పదంమాధవః 16

ఇత్యధికం కింతు సర్వాసాం

తథాపి పిశునరసనాపిశాచీ ధీరతాండవ నివారణ మేవ సమంచితం[3] కులాంగనానామ్.

రాధికా — సఖి! నవమాలికే! నఖలు భవాదృశో జానంతి మర్మ[4]వ్యథాం విషమ సాయక పాతస్య పరం త్వత్ర[5] ప్రేమకళా పృచ్ఛతామ్.

ప్రేమ — గురుజనభయం, పాతివ్రత్యం జనారవతో[6] భయం
సహచరి! శపే[7] వారం వారం త్రయం పరిరక్షితుమ్,
శ్లథయతి పరం మందం మందం విభోరధరస్థలీ
విగళదమృతాశంసీ[8] వంశోనినాద లవోదయః. 17

---

1. కుండల 2. ద్యుతి. 3. పాఠోన్నాస్తి. 4. మమ
5. తత్ర 6. జనాననతో 7. మతం 8. శంసత్

రాధికా –(వంశీశ్రవణ మభినీయ ప్రేమావస్థాం నాటయతి)

ప్రేమ – ఇయం పులకమండలీ కవి౦తా కపోలస్థలీ
తథా సరస శీత్కృతిః స్ఫురిత మానసాంభోరుహమ్.
అయంచ కుచకాంచనాచలజ నర్మఘర్మోదయో
ముహుః సుముఖి! వేపనే మదన హేతి[1] భీతేవ కిమ్? 18

రాధికా– (నీవీ సంయమన[2] మభినయతి)

నవమాలికా–(సహాసం)
నీవీం నవీకృత్య నితంబబింబే
కియత్పరిశ్రామ్యతి కోమలాంగి.
పీతాంబరః పశ్యతి సస్మితం చే
త్తదా భవిత్రీ స్వయ మేవ బద్ధా. 19

రాధికా – (నవమాలికాం విలోక్య సానందం)

అహో మురారే ర్మురళీ నినాద
లీలాయతానాం పర మూర్జితాని.
భవాదృశాం యేన మహాసతీనాం
కపోలమూలే పులకావళీయమ్. 20

నవమాలికా-(సలజ్జ మధోముఖీభూయ స్వగతం)
గోపం కంచన కాంచనాంబరమయే పశ్యామిన శ్యామలమ్
యస్యాలోకవశాదృశా మృగదృశా మేషా విశేషాదభూత్
ఇందు స్సిందుక పావకో మలయజాలేపోఽపి సంతాపకః
ప్రాణాయేవ నిజర్ద్విషా గురుతరో హారోఽపిమారోపమః
21

1. భీతి 2. నీవికా సంయమన 3. భారోపమః

విషమ విశిఖ సూత్రం కృష్ణవంశీ నినాదో
యదవధి తరుణీనాం కర్ణపీఠే లులోఠ,
అవిరళపులకాళీ కోమలా గండపాళీ
తదవధి తనుతేఽసౌ[1] భాగ్యబంధురం నివద్యమ్. 22

(నేపథ్యే)–

దేవతా ముకుటకాంతి మంజరీ పింజరీ కృతపదాంబుజద్వయం
మారకాతరిత గోపనాగరీ రాగరీతి రసికం భజేమహః. 23

ప్రేమకళా– కథం చిత్రఫలక హస్తే రసాలక ఇత ఏవ ఆయాతి
(తతః ప్రవిశతి యథా నిర్దిష్టో రసాలకః)
ధామని స్ఫుటితహార దామని నీల నీరద సమానధామని!
వామనీకృత కుచాన్త[2] కామినీ కామనీతి రసికే రసామహే. 24

రాధికా– ఇద మనర్థ కందళీ[3] మూలం యత్ఖలు రసాలహస్తే
చిత్రఫలకం

నవమాలికా–సఖి! త్వమేవ మంకురయసి. మయా ప్రాగేవోక్తం,
నేదం వకుళమాలికా హస్తే దీయతా మితి.

ప్రేమకళా– సఖిరాధికే! తయాఖలు చంచలతయా కుత్ర[4]పాతితం
తత్తులు అనేన వటునా సమానీతం; తత్ కథయ[5] కథ
ముపాయై గృహ్యతా మితి

రాధికా– ఇదమేవ తావత్ చింతయామి. న పునః కదాచిత్[6]
గోవిందకరారవిందమకరంద రసనిష్యందాభిషిక్తం[7] భవేత్.

---

1. అసౌ 2. కుచాన్త 3. ఆనందకందళీ 4. కుత్రాపి 5. కథయ
ఇతి పాఠాన్తి 6. కథంచిత్ 7. ఆనందాభిభూతం

నవ- [చంద్రమసం విలోక్య]

నూతనారుణమయూఖ పావకే లక్ష్మవల్లి ఘనధూమ భూమని.

హోమకుండఇవ చంద్రమండలే సంజుహోతి యువతీజనం స్మరః. 39

ప్రేమ- ఇద మవధారయామి

తను పూర్తికృతే మృగచ్ఛలాద్ విధుపీయూష తడాగ పాథసి.

శశిశేఖర బాల వహ్నినా దరదగ్ధకుసుమేషు రంజతి. 40

రాధికా- [సవితర్కం]

పరిణామ ముపైతి సంధివర్జం రజనీనాథ సురాధినాథ దంతీ.

అపి తత్ర కళంకవల్లి దంభా న్మదధారా గళితేతి తస్యశంకే. 41

ప్రేమ- గగన మిద మిదానీం యాతి కాసార శోభాం

తదను ముకుట[1] లక్ష్మీం తారకాః సంక్షిపంతి.

అపి కిరణ మృణాళీ మూలకందోయ మిందు

తదిహ స్వనతి లక్ష్మ చ్ఛద్మనా కోఽపి కోలః. 42

నవ- మదాలస విలాసినీ దశనకాంతి సన్తానకః

స్ఫురద్దరహసచ్ఛటా ద్యుతివిలాసి వైహాయసికః.

చల త్తరళ రోహిణీ రమణ మండలాడంబరః

శరత్కిరణ మంజరీ పరిచయోఽయ మున్మీలతి. 43

రాధికా- [భవన స్పర్శ మభినీయ]

---

1. కుసుమ

ఆందోలనో తరణ చందన వందనీయో
మందానిలో భవతి తాపకరః[1] కి మేతత్.
కిందాశిభర్గ నయనా జ్జ్వల వహ్నిరేఖా
సందగ్ధ పంచశరభూత వివ ర్తవాతః. 44

సర్వాః- హంహో తమాల కృతమూల రసాలసాల
హింతాల తాల వకుళార్జున ముఖ్యవృక్షాః.
ఆవేదయంతు నవనంద కిశోరమార్గం
నేత్రాంజలైః కువలయైరివ పూజయామః. 45

[ప్రేమ- వంశీ ముద్దిశ్య సానుక్రోశం[2]]
జానే తవైవ వశ్యా మురళి! తపస్యాపరం రచితా
ఏకాకినీ మురారే శ్చుంబతి బింబాధరం యస్మాత్[3]. 46

వకుళ- (సకరుణ మాకాశం లక్ష్య మంజలిం బధ్వా)
ఆలోలకుంతల[4] ముదంచిత మందహాసం
సీమంతినీ నాంకకులం నవధర్మపూరం.
దాస్యామి జీవనమపి త్రిదశాధినాథ
యద్యేకవారమపి తే వదనం విలోకే. 47

[ప్రేమ- నయనాంతేన[5] జీవన్తి సంతపా హారిణీ దృశః.
తత్రాపి యది కార్పణ్య మహో తవ దయాళుతా. 48

నవమాలికా- కృపాకటాక్షైః కరుణాంబురాశే
యదీక్షసే మాం జగదీశ! నైవ.
విలోకనాచ్ఛే త్క్రమ యోగనిద్రా
జహాతి నాద్యాపి మదీయ పాపైః. 49

1. దాహకరః 2. సానురాగం 3. యేన 4. కుంతల
5. కటాక్షేణాపి

సర్వాః— (సాంజలిబంధం)

విద్మో న పరం కించిత్ మురళీ తరళీకృత వదనాత్,
కించి దుదంచిత సితా దసితాకృతి వల్లవీ తనయాత్. 50

(కించ)

ఆకులీ కురూషే హంత కిమేవం నిజదాసికాః
అథవా నాథ! నిర్బంధః స్త్రీవధే ఫల మస్తి కిమ్. 51

(నేపథ్యే)

అయమేతి మంద మరవింద లోచనా
జనలోచనాంచల చకోరచంద్రమా,
పరివీత పీతవసనో మదాలసో
దరహాస భాసుర ముఖో జగత్పతిః. 52

సర్వాః— [స్వాగతమ్]

జగతా ముపకారాయ త్రిలోచన విలోచనః,
యే నైవ పంచబాణోఽపి రూపవా నభిరూపితః. 53

ఆగచ్ఛత. గచ్ఛామః. [మాధవాంతిక ముపసర్పంతి]

రసాలకః— అహమ ప్యాత్మానం ప్రకాశయామి. [ఇతి ఉపసర్పతి]

మాధవ— కిం వః ప్రియం కరవాణి?

సర్వాః— కి మతఃపర మస్తి ప్రియమ్?

మరుత్ఖేలాందోళాయిత[1] నళిన పత్ర ప్రణయినో
సుధాధారాసార వ్యతికర సమీచీన స్వనాః,
జనానా మానందం వహలయతు[2] గోవిందః! భవతో
దృశో రేషా లోలా నటన ఘటనానాం పరిణతిః. 54

---

1. విలోచనమ్ 2. విరచయతు

[తథా పీద మస్తు]

కవీనా మస్మాకం గతహరిణ పీయూషకిరణ
ప్రభాస్పర్థీ బంధాధిక మధురవాచాం పరిచితం,
సతాం భూయో భూయో వహతు బహులానందలహరీ
పరీవాహన్వేద ద్రవ జలధి కల్లోల కపటాత్. 55

శుభమస్తు సర్వజగతాం నిరంతరమ్
న రిపోరపి స్ఫురతు పై పదంపదం,
జగదీశ్వర కపట దారువిగ్రహః
కరుణాకటాక్ష లహరీం విముంచతు, 56

[ఇతి శ్రీ జయదేవరచితం పీయూషలహరీనామ గోష్ఠీరూపకమ్
సమాప్తమ్]

[Published in Nagari Script in the Journal of
The Kalinga Historical Research Society-
[Vol – I, part 4]

[Reprinted with due acknowledgment
of Courtesy

నవమాలికా — నిశ్చయార్థే కిమితి శంకసే?

రాధికా — ఫలేనైవ నిశ్చీయతే.

రసాలకః— (ప్రవిశ్య) స్వస్తిభవతీభ్యః— (ఇతి చిత్రఫలకం సమర్పయతి.)

(సర్వా విలోక్య పఠంతి.)

త్వం తావ ప్రథమేవ[1] చంద్రకళికా సంతప్త చింతామణి
ర్నవ్యాః కేఽపి వయం నికామతరళా శ్చారాశ్చకోరా ఇవ,
భూయో వీర్యపరీక్షయే వితనుతే సంతాప మంతర్జని
ర్నో జానే తవ కోమలాంగి! గళితో యేనైష చిత్తజ్వరః. 25

(సర్వా అన్యోఽన్యమ్.) సఖి! త్వదర్థమేవ మురారే రూప శ్లోకితం— (ఇతి కలహాయంతే.)

ప్రేమ— (అపవాయ)

పాదౌ నూపురపూరితౌ కటితటీ పీతాంబరాలంబినీ
వక్షః కుంకుమపంకిలం కరతలం వంశీ వతంసీకృతం,
బింబోష్ఠి[2] మదవిభ్రమ[3] స్మిత పరా[4] కేశోఽపి వేశోచితో
నో విద్మో నవనీల నీరదవపుః కస్యాస్తపస్యాఫలమ్. 26

(నేపథ్యే)

రాకా శీతమయూఖ సుందరముఖో విస్తారివక్షస్థలః
ఖేలత్కేసరి మధ్యమో మరకతశ్రీ చుంబి దోర్దండరః,
కందర్పాదపి సుందరో మదగజశ్రీ గర్వ సర్వంకషః
శేషాం నైవ మనోవినోదన కృతే రమ్యాకృతిః శ్రీపతిః. 27

1. ప్రథమైవ 2. బింబోష్ఠే. 3. మదవిభ్రమః 4. స్మితపరః

ప్రేమ– (విలోక్య) కథ మేషా వకుళమాలికా హృదయే నీలో
త్పలం ముహూర్ధధానా సానంద మిత ఏ వాభివర్తతే.

(తతః ప్రవిశతి యథా నిర్దిష్టా వకుళమాలికా)

రమ్యాధరః[1] స్ఫురదధోరసుధా సముద్ర
మాధుర్య చుంబన కళామివ సూచయంతీ,
చేతా మదీయ మధునా మధునాశనస్య
హా హంత హంత మురళీ తరళీకరోతి. 28

(విలోక్య) కథమేషా రాధికా సఖీభ్యాం రసాలకేన చ అను
గమ్యమానా వకుళ వీథికా పరిసర ఏవ నిత్యానురాగ కళికం వికాస
యతి. తదహమ పి సఖీం సంభావయామి.

రాధా – (అపసృత్య) సఖి ! కథ మే తదవతంస నీలోత్పల మతీవ
సంభావయతి.

వకుళమాలికా –

రభసేన రహః పరిచ్యుతం
సనీలోత్పల కోరకం మురారేః,
నయనాంచల నీతినిర్జితం
భృగుపాతం వహతీవ భూతలేఽస్మిన్. 29

(ఇతి రాధికాయాః కర్ణే కథయతి.)

రాధికా– సఖి! జీవితాస్మి, కిర్ణావతంసనైవ,

నవ – సఖి ! సఖిః కృష్ణేనేతి శేషః

(ఆకాశే)

ప్రస్తావయంతీ కియద్భుతాని నాందీవ రాసోత్సవనాటికాయాః,
మహామునీనామపి మానసాని మురారి వంశీ వివశీకరోతి, 30

[సర్వాః సానందం ఇద మిత్థమేవేతి మదనావస్థాం నాట్యంతి]

1. బింబాధర

రసాలః— [సపులక మంజలిం బద్ధ్వా]
పరం బ్రహ్మం నిరాకార మవాఙ్మనసగోచరమ్.
వల్లవీ తరళాపాంగ పల్లవీకృత మాశ్రయే. 31
[విలోక్య]
గోపీమనోహరణ నాటక సూత్రధారీ
ధారాయమాణ[1] మదనాశుగ కాందిశీకః,
కందర్ప దర్పహర మూర్తి రసౌ మురారిః
బృందావనే మురళికాం తరళీకరోతి. 32

నవమాలికా — పురః ప్రాలేయాంశు ప్రతిభరముఖీ ప్రేమవసతిః
సతీనీవీ బంధస్థితి విఘటనైక వ్యసనినీ,
సమాయాంతీ బృందావనకుహర మానందరభసా
దయే కేయం శ్యామచ్ఛవి రమృతధారా పరిణతిః. 33

రసాలకః— లతాంతరితో రాసోత్సవం నిభృత మవలోకయామీతి
[తథా కుర్వన్ ఇవ స్థితః]
[తతః ప్రవిశతి యథానిర్దిష్టో మాధవః]

మాధవ— కథమేతా మదంతిక మేవ సమాయాంతి! తన్నిమిష
మాత్రమేవ ధైర్య మవలంబిష్యే. సర్వా మాధ
వాంతిక ముపసర్పంతి]
[రాధికాం నిర్వర్ణ్య]
నీలాంశుకాలంకృత[2]పీవరోరూ
ర్దరస్ఫుర న్కోమలబాహుమూలా,
వతంసయంతీ సుముఖీ విభాతి
సమ్మోహ విద్యేవ మనోభవస్య. 34

1. వ్యాధాయమాన, 2. చీనాంశుకాలంకృత

[తతః ప్రేమకళా నిర్వర్ణ్య]

ఏషా ప్రసూనాశుగ[1] చాపయష్టిః స్పష్టీకృతా భ్రూలతికాపదేశాత్
సిందూరబిందు ర్గుళికేతి[2] శంకే పంకేరుహస్మేరదళాయ తాక్ష్యా[3]. 35

[వకుళమాలికా మాశ్రిత్య విలోకయా మ్యాసాం భావం నిభృతమితి]

[తథా కరోతి]

రాధికా– కథ మత్రై వాంతరితో[4] మాధవః [సర్వా నిరూపయంతి]

[రాధికా నిపుణం నిరూప్య]

నమ్రీభూత సురేంద్రమౌళిముకుట ప్రాగ్భార సంభావితమ్,
గోపాలీకుచకుంభపాళి విలసన్ కస్తూరికాశ్యామలమ్
దైవాదేవ కదంబమూల మిళితం లక్ష్మీవిలాసాస్పదం
సంప్రాప్తం క్వను హారితం బత మయారత్నం చిరత్నంపునః 36

వకుళ– [ఆత్మానం నిర్వర్ణ్య]

ప్రాణమాత్రే[5] విగళితేన జీవంతి క్వచిజ్జనాః,
వినా ప్రాణాధిక మహం జీవామీతి కిమద్భుతమ్. 37

[సర్వా వియోగావస్థాం నాటయంతి.]

విభ్రతశ్చిబుక మంగుళిముఖై[6]ః
కించిదంచిత వికార సీత్కృతే[7]
అర్ధచుంబనమహో మురద్విషః
ప్రాణమేవ సుదతి ప్రతిక్షణమ్. 38

---

1. ప్రసూనాయుధ. 2. గుళికేవ, 3. దళాయతాక్షయా 4. అంతర్హితో
5. అవిగళితే. 6. అంజలిముఖైః 7. సీత్కృతః.